శ్రీ

# బహులాశ్వచరిత్రము.

అను ప్రబంధము

దామరల వెంగళభూపాలవిరచితము.

(సరస్వతీపత్రికనుండి పునర్ముద్రితము)



మొదటికూర్పు 500.

కాకినాడ:

సరస్వతీముద్రాక్షరశాల.

1906.

రంకుశోపాఖ్యానము దీని ననుసరించెను. ఈతఁడు గ్రంథాంత గద్యమందును వంశావతారమునందలి పద్యములయందును విశేషముగఁ బ్రభుత్వముఁ గనఁబఱచుకొనియెను.

మాకీగ్రంథము తప్పులకుప్పలతో నిండిన తాటియాకుల ప్రతియొకటిమాత్రమే గోకివాడ నివాసులగు మ॥రా॥ మంచికంటి గున్నారావుగారి మూలముగా దొరకినది. అందలియొక్క పద్యమేనియుఁ గవితావాసనయు నాంధ్ర గీర్వాణభాషా వివేకంబును లేనివారు చదువుటకు వలను గాకున్నయది. కొన్నిచోట్ల నట్టివారికిని దుర్లభములైన ఘట్టములుగలవు. అయినను నాభాగములు మాస్వశక్తికొలఁది సంస్కరించితిమి. కాని తెలియనిచోట్ల దిద్ది మాకవిత్వముమాత్రము చొనుపక యాభారమును జదువరులకే వదలినారము. అర్థజ్ఞానము లేని లేకరులు వ్రాసినచో నెంతయుత్తమ గ్రంథముల గతి యేనియునిట్టిదేయగును. కావుననే “యూహాతెలియంగల లేఖకపాఠకోత్తముల్ దొరకినఁ గాకయూరకకృతుల్ రచియింపుమటన్న శక్యమే” అని పెద్దన్నగారు నుడివిరి. ఏదె
ట్టిమొట్టి వ్రాతయో యొక ప్రతివ్రాయుట చేతనే కదా ఖిలమైపోకుండ బయటఁబడుటకుఁ గారణమయినది. కావున మేమాలేకరి నభినందించుచున్నాము. ఈగ్రంథమును సంపాదించి మాకిచ్చిన మ॥ గున్నారావుగారికిఁ గృతజ్ఞులము.

ఇట్లు

శ్రీ కో. రామచంద్ర వేంకట కృష్ణ రావు,

శ్రీసరస్వతీ పత్రికాధిపతి.



శ్రీరస్తు.

# బహులాశ్వచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

---

శా. శ్రీమద్భూమిసుతాధవాంకపరభూసీమంతసీతాలలం
తీముక్తామణిపేరివిత్తునకు జ్యోత్స్నాకాంత కాంతిచ్ఛటా
భూమంబుం బయిఁజిల్కఁ దళ్కొనుఁజూపుల్వ్యాచు శ్రీరాముఁడీ
దామర్లాన్వయవేంకటాద్రివిభునిన్ ధన్యాత్ముఁగాఁ జేయుతన్.

చ. వసుధకు నింపుగా నజభవప్రియ మానరయుక్తిఁ గాంచి తా
నసదృశలీల రాజగురుఁ డౌజనకు న్వెలయింపఁజేసి యా
య్యాసమశరాత్మసంభవసమూహ ల్[illegible]
రసకరవేంకటాద్రివిభురత్నగృహంబున నిల్చి గావుతన్.

శా. దుర్గాధ్యక్షుఁడ వైతి విష్ణుఁడ ణిమాదుల్గొంటి వే మంచు నా
శీర్గాథ ల్వచియింప నేరిచెద మోశ్రీకంఠ యంచు న్మను
ల్గర్గాదుల్ గిరిపుత్రిపెండ్లి నన వేడ్కం జూచుచూడ్కిం గను
న్భర్గుం డాహవభీము వేంకటమహీపాలున్ దయాశీలునిన్

చ. అమరనదీసమేతకమలాస్త్రభవారుచి శీతభూధరో
త్తమరమణీయనీలజలదద్యుతివైఖరి వెల్లిదీవిపై
నమరిన సింధురాజతనయాధిపదీపితదీప్తి మీఱుచున్
రమణుని యర్ధదేహమున రంజిలు గౌరి శుభంబు లీవుతన్.

శా. వాణీపాణివిపంచికాకలకలక్వాణాప్తికిం జొక్కి వా
క్ప్రాణేశుం డెద వీణకాయ కుచవిభ్రాంతి న్నఖంబొత్తి బ్ర
హ్మాణీహాసముఁ గాంచి కచ్ఛపిసమాఖ్యం దానిపైఁ బ్రాయు గీ
ర్వాణజ్యేష్ఠుఁడు ప్రోచు వేంకటనృపప్రద్యుమ్ను నెల్లప్పుడున్.

మ. జగము ల్మెచ్చవిపంచి మీటితివి నీసంగీతసాహిత్యము
ల్పొగడ న్నేర్చునె యొక్కరుండు కఠినంబు ల్తత్పరీపాకము
ల్మగఁ డొక్కింత యెఱుంగ నేర్చు నను బ్రహ్మాణీకు సర్వోక్తికి
న్నగుచుం బయ్యెదఁ జక్కఁజెక్కి కొనుపీణాపాణిఁ బ్రార్థించెదన్.

మ. నిజదంతప్రసవంబు హస్తమధుపోన్మేషంబు హారావళీ
భుజగవ్రాతలతాసమేతము మదాంభోవారమారందము
న్భుజశాఖాశ్రుతిపత్రము ల్కుక్షిఫలంబుం గల్గి సొంపొందు నా
గజరాజాననకల్పభూజ మొసఁగుం గల్యాణసాఫల్యమున్. 7

చ. తిరముగ వింట వేవెలుఁగుదేవునిఁ గన్గొని వట్టియాస ని
ట్టరముగ నేగి చేఁగడిమిఁ బట్టిన లావరి నేలచెల్వకూఁ
తురిచెలువంపుఁ జేనియొనతుండుడు కెల్లను దీర్చినట్టి యా
కఱువలిపట్టి నాదుమదిఁ గల్గినకోరిక లెల్ల నీవుతన్ 8

సీ. ఘననాకుభవభుజంగప్రయాతం బెన్ని శుకతాతబింబసంశుద్ధి వొగడి
యలకాళిదాసుని యార్యసన్నుతిచేసి దండి వంశస్థవృత్తము గణించి
యిలమయూరకుమారు లలితసంగతి మెచ్చి బాణపుష్పితలతఁ బ్రస్తుతించి
భవభూతి శశికళాభాసురత్వం బెన్ని మఱి ధనంజయువసుమతి నుతించి
ప్రౌఢిఁగాంచు కవిత్రయీప్రణవమహిమ, సార్వభౌముని పృథ్వి భాస్కరునికాంతి
భీమమత్తేభబలమును సోముహరిణి, నటుల నమరేశ్వరుని వజ్రపటిమఁ దలఁతు. 9

సీ. శబ్దదరిద్రుఁడై శారదాభ్రముఁబోలుఁ బ్రాసంబు విడిచి సంత్రాసిఁ బోలు
నపహృతాన్యాలంక్రియతఁ దస్కరునిఁ బోలుఁ బృథులార్థదూరుఁడై పేదఁ బోలు
విగళితౌజస్కుఁడై పగలింటి నెలఁబోలు నవిదితధ్వనికుఁడై చెవిటిఁబోలు
పద్యావభిజ్ఞతాభంగిఁ బంగవుఁ బోలు భిన్నమాధుర్యుఁడై పిప్పిఁబోలు
ముక్తసూక్తప్రసాదుఁడై మూర్ఖుఁబోలు, జీర్ణపాదతనదియోర చెట్టుఁబోలు
లుప్తసముదాయభావుఁడై లోభిఁబోలు, సుకవివాసరధవదివాంధకవి కుకవి. 10

ఉ. అంగడియంగడిం దిరుగులాడుటకుం బలువిత్తు లిష్టతిం
బొంగుచుఁ గాసుగప్పరకుఁ బోవుచుఁ బెక్కుపదార్థముల్ గ్రహిం
పంగొఱగాక రోఁతలకుఁ బాల్పడి బిట్టుడికింప ప్రోఁత లె
ల్లంగను కూరగాయకవుల న్సరకించుక సేతురే కవుల్. 11

మ. ఉపమానైపుణిఁ గాళిదాసు లఖిలార్థోత్పదనాభారవు
ల్సుపదస్థాపనరూఢి దండికవిరాజు ల్జాతివార్తారళో
ర్మిపదోజ్జృంభణశబ్దగుంభనక శ్రీనాథులే కాక యే
కపద్భ్రామ్యదసంప్రదాయకవులా ఘర్షింప మాబోఁటులన్. 12

వ. అని యిష్టదేవతాప్రణుతియు సుకవిసంస్తుతియుఁ గుకవినిరాకృతియుం గావించి

బహులాశ్వచరిత్రప్రబంధనిబంధనంబు సేయసమకట్టి యున్నచో నొక్కనాఁడు
మదీయస్వప్నంబున. 13

సీ. అలమించు నలయించు కళనించు దుప్పటిఁ గట్టువాఁడు బలీంద్రు మెట్టువాఁడు
వక్రంబునక్రంబు చక్రంబుచేఁ ద్రుంచు కరమువాఁ డసురభీకరమువాఁడు
కందంబు చందంబు నందంబు గావను మేనివాఁడు భవంబు లేనివాఁడు
లలిఁ గమ్మ వెలిదమ్మిలను జిమ్మ కనుదోయి డాలువాఁ డవనిజ నేలువాఁడు
తేజరిల్లెడు నెక్కలతేజివాఁడు, చూపులను భక్తులకు పిద లూచ్చువాఁడు
రామభద్రుండు కారుణ్యరససముద్రుఁ, డావరంబున నిట్లని యానతిచ్చె. 14

ఉ. దామరవేంకటప్రభునుతంసుని వెంగళభూప మాపయిన్
శ్రీమెఱయంగఁ గృష్ణకథఁ జెప్పితి విప్పుడు నీదుతండ్రియు
న్నామకభక్తుఁ డాతనికి మాకును భేదము లేదు గాన నీ
వామహిమాఢ్యపేర బహులాశ్వచరిత్రముఁ జెప్పు మొప్పుగన్. 15

క. అని పలికి చనిన మేల్కని, మనమున డాసంచరసనిమగ్నము గా న
జ్జనపుఁ డగు వేంకటేంద్రుని, యనఘుని వంశావతార మభివర్ణింతున్. 16

క. ధునిఁ గనియె స్ఖలితల యు, న్కనిఁగొనియె న్ఫణిఫణామణిఘృణి ఘుసృణా
ప్తిని మనియె న్మునిపెండ్లికిఁ, బనివినియె న్హరిపదంబు భవ్యము గాదే. 17

క. ఆచరణాంబుజమున నా, రాచరణాచరణచలితరాజన్యుఁడు వా
చాచణయాచకఖేచర, నైచికి శ్రీపాదమనుజనాథుఁడు పుట్టెన్. 18

క. శ్రీపతి పదపద్మమున ఘృ, ణాపటిమ జనించి పద్మనాయకమణి సౌ
ధీపాండితి నేపారిన, శ్రీపాదప్రభున కబ్బనృపతి జనించెన్. 19

క. ఉబ్బఁడు లిబ్బులు గలవని, రెబ్బఁడు రిపురాజుఁ గాని రేఖలవలరా
యబ్బఁడు పరభామిని కై, యబ్బఁడు శ్రీపాదసూని యబ్బఁడు ధాత్రిన్. 20

క. అబ్బనృపాలాగ్రణికిం, బిబ్బోకవతీవతంసబిసరుహవిశిఖుం
డిబ్బలియుఁ డనఁగ నీవుల, నబ్బలి యన ధర్మనృపతి యతఁడు జనించెన్. 21

శా. కర్మణ్యావనబద్ధకంకణుఁడు కంఖాణాశ్వరింఖావళీ
ద్దుర్మత్తద్విపదుత్కరుండు కరుణాధుర్యుండు ధైర్యాగునా
భర్మాహార్యము నీతికార్యధురభిత్పర్యంక మార్యాప్తుఁడా
ధర్మక్ష్మాపతి ధర్మమర్మవిదుఁ డేతన్మాత్రుఁడే ధారుణిన్. 22

క. అధర్మనృపతి కుధరము, హాధృతి వెలిగోటితిమ్మయప్రభుసత్పు

శ్రీకన్య వెంగళాంబిక, గాఢానిధి ధర్మపత్నిగా నుతికెక్కెన్. 23

వ. ఆవెంగళాంబికయందు. 24

సీ. వరదయాదాక్షిణ్య వరదయాదవభర్త వరదయాధీశ్వరవజ్రపాణి
యంగలాటకళింగవంగలాలితకీర్తి వెంగళాధిపపంచవిశిఖమూర్తి
ఝుమ్మయానకరవాసమ్మగాస్యవిరోధి తిమ్మయావనితలాధీశమౌళి
దీనయాచకచయాధీనయాచ్ఞవితీర్ణి కోనయాఖ్యనృపాలకువలసఖుఁడు
నలుగు రుదయించి రరవిందనందనాన, నాంబుజంబులబలెనె ధర్మాధిపునకు
వట్టి ధర్మధురీణులుఁగు ధైర్యాంబుధులకు, దాశరథు లాచతుర్యుగాధీశు లెనయె. 25

క. వారలలో వెంగళనసు, ధారమణుఁడు ధాత్రియేలె ధాటీపటహా
దారధణంధణనిధ్వని, ధౌరంధర్యాద్రిదావధానద్రిపుఁడై. 26

సీ. తనపదాతిశయంబు తనపదాతిశయంబుకరణి నాళీకసంగతి నటింపఁ
దనసువృగ్గరిమంబు తనసువృగ్గరిమంబుగతిఁ గౌముదీప్రసంగంబు నిలుపఁ
దనవిగ్రహోన్నతి తనవిగ్రహోన్నతికైవడి నసమాస్త్రకలన దెలుపఁ
దనకరస్ఫురణంబు తనకరస్ఫురణంబు ప్రఖ్యాతి సగరవైభవము పూనఁ
బరిఘవిల్లుశరద్విషత్స్వరివృషత్ప్ర, గాఢభుజపీఠకురశాఖికాభిదావి
ధాకత్రీరకుతారికాంధగ్మజుండు, నృపతిదామర్ల వెంగళోర్వీధరుండు. 27

సీ. వనధిజ యొనవచ్చుఁ దనగృహశ్రీయన్న కరమున కందిచ్చి మురియనున్న
సతిఁ బ్రతి యనవచ్చుఁ బతి మాఱుమాటాడి సవతికిఁ గ్రిందయి వనయనున్న
వాణి నీ డనవచ్చు వరుమొగంబున వ్రేలియును బెక్కుబాసలుఁ గొనకయున్న
నింద్రాణి సరివచ్చు నెలమిమైఁబలుగాకివగలబిడ్డని గని వగవకున్న
నచలగతిపూర్ణచాపమితానులాప, సుస్థిరప్రాభవంబుల సొంపుమీఱు
వెంగళక్షోణిపాలు నర్థాంగలక్ష్మి, యైన లక్ష్మాంబికాపయోజాక్షి కరయ. 28

ఉ. శర్మఘనుండు వెంగళరసాతలభర్తకు లక్ష్మమాంబకున్
ధర్మనృపాలమౌళి వరదప్రభుచంద్రుఁడు వేంకటేంద్రుఁడుం
దిర్మలశౌరి నల్వురు జనించిరి శ్రీహరిబాహులట్లు చా
తుర్ముఖవక్త్రముల్బలెఁ జతుర్నిగమంబులచంద మొంపఁగన్. 29

శా. ధర్మానర్మవిధిజ్ఞభావవిలసద్ధాత్రీ బుధశ్రేణికా
శీర్మర్యాదలు గన్న దామరల మాశ్రీవేంగళేంద్రాత్మభూ
ధర్మానాయనిపూర్ణనాయని సుదృద్గానంబు వర్ణించునో

ధర్మాన్వయనిజాలయాధములు గాధగ్గాధను త్మెత్తురే. 30

మ. శరదంబై శరదంబుదద్యుతరుచ్యంబై జితాఖండల
ద్విరదంబై మురదర్పభేది చరణద్వీపిన్యుదారప్రభా
వరదంబై నరదంతివైరి బలె తేసన్వాంగశేంద్రాత్మభూ
వరదక్ష్మావరదర్పకార్జితయశోవ్యగ్రంబుదగ్రంబగున్. 31

క. దామరలవేంకటేంద్రుం, డేమఱఁడు మురారిచరణహితవిస్ఫురణం
జేమఱఁడు వితరణంబున, సామరసన్నాహశత్రుసంహరణమునన్. 32

క. వేంగళవిభు తిమ్మప్రభుఁ, డంగజనిభుఁ డధికసుబలభుఁ డహిమాంశునిభుం
డంగత్రిలింగవంగక, ళింగంబుల నీడుజోడు లేరు వదాన్యుల్. 33

మ. భయవిభ్రాంతి విజాపురీశుఁ డరిగెం బన్నాలకు న్మల్కయుం
బయిగోవం బడిమె న్నిజామ్ము చనియె న్మక్కాపురక్షోణికిన్
గయకు న్వెల్వడె నాగరానగరభూకాంతుం డు దామర్ల తి
మ్మయదంతావళఘోటికాభటసముద్యద్ధాటిసామాన్యమే. 34

చ. తదనుజ యైనలోకహితధర్మవిశంకట వేంకటాంబికం
గదనకిరీటి యాచవిభుకస్తురిరంగనృపాలవర్యుఁ డిం
పొదవ ధరించి కాంచె విభవోజ్జ్వలు రంగయయాచభూవరు
న్విదితగుణాఢ్యు సింగపృథివీవరచంద్రుని నక్కమాంబికన్. 35

సీ. ఉత్తరమల్లూరి యొద్దదావలపాప విభునిగొట్టిననాఁటి విజయకలన
తిరుమలచేరిధాత్రిని మన్నెరాజులఁ బాఱఁద్రోలిననాఁటి బాహుబలము
చెంగలిపట్టువీక్షించి లగ్గలుపట్టి యాక్రమించిననాఁటి విక్రమంబు
పాలెంబుకోట వెల్పట నాజి యతిరాజు జరగఁజేసిననాఁటి శౌర్యపటిమ
మున్నెతోపూరు జగ్గరాణ్ముఖులనొంచి, మధురదొర చెంజిమన్నీని మదమడంచి
తిరిచెనాపలిచోఁరదోలు తేజముగల, మేటి వెలిగోటి యాచనిసాటిగలరె. 36

క. ఈమన్నీలలి గను కాం, తామణిపుట్టినిలు దానధర్మదయాల
క్ష్మీమహిమల పుట్టిల్లఁట, దామర్లాన్వయముఁ బొగడఁ దగదే ధాత్రిన్. 37

ఉ. ఏచతురుండు సాటి మనయేచనృపాలుని మేనమామ యు
ర్వీచిరకీర్తిఁ దామరలవెంగళభూవిభు వేంకటాద్రి హే
మాచలధన్విమామ ధృతి నంగజమామ రుచి న్వితీర్ణిఁ బ
ద్మాచణవక్షుమామ యభిమన్యునిమామ సృపాలగుణాదులన్. 38

సీ. అంచతేజీ నెక్కి యాడు వాగ్బింబోష్ఠిఁ దాతసాతి యటంచు బూతులాడు
సచ్ఛప్రసూనగుళుచ్ఛకల్పకవల్లి నందనోద్భవయంచు నవ్వులాడు
భోగీంద్రశయనాంఘ్రిభూతవాహినిఁ బితామహుని చెల్లెలటంచు మఱియుఁ గేరు
శుభ్రాంశులోనున్న సుధఁ గాంచి జనకమాతృసహోదరి యటంచుఁ దెగడఁ జాలు
దామరల వేంగళక్ష్మాధవవతంస, నందనుఁడు వేంకటక్ష్మానాథచూళి
ధేనుధనధాన్యకన్యకాధికవదాన్య, తానియతిఁ గొన్న యసపుబిత్తరి ధరిత్రి. 39

సీ. కడలుద్రొక్కఁగనిమ్ము వెడలుటల్దింతుఁబో యలపరాంగనపొందుఁ దలఁపకున్న
వలకులోఁగఁగనిమ్ము వెలకు రానిత్తుఁబో యలపంది దగఁజెంది నిలువకున్న
వలసిన ప్లాడనీ కలసి వర్తింతుఁబో బహుభుజంగిక్రీడఁ బరఁగకున్నఁ
గూర్మి వేఁఱొడ్డనీ పేర్మినాటింతుఁబో తిరుకుళంబులవారిఁ బొరయకున్న
ననుచుఁ గరిఁ గిరి ఫణిఁ గూర్మమును ద్యజించి, ధరణితరుణీశిరోమణి తరణితేజు
దామరలవెంగళక్ష్మమాధవతనూజు, భోజనిభు వేంకటక్ష్మాబిడౌజుఁ జేరె. 40

సీ. దాని యన్నాట మాత్రమె కాని విసరింప దెసలకుఁ జేచాచు దిగ్గజంబు
ఘనసంపదల నింపు గనుననుటయ కాని నేలదున్నక తినుఁ గోలభర్త
పడగలెత్తెన సెడు ప్రఖ్యాతియే కాని గాలివటించు నాగకుల నేత
కచ్ఛపేశ్వరరూఢిఁ గాంచి మించుటె కాని యానుఁబానీయంబు లాదిక మత
మేటినడ కేటిసౌకర్య మేటిభోగ, మేటికూర్మియటంచు నాపాటి రోసి
దామరల వేంగళక్ష్మమాధవవతంసు, వేంకటేంద్రునిఁ జేరె నుర్వీసధూటి. 41

సీ. అలరాహిణేయగుర్వనఘద్యుతుల మించు హ్రాదినీధారివాహరుచి మించు
తారకోదారసత్కాంతిపూరముఁ జించు విశదాబ్జవీధితి వెస హరించు
నతనుశరద్యోతు లనిశంబును జయించు నమరనాగేంద్రధామము హసించు
పంచాస్యశోభాప్రపంచముఁ ద్యజియించు దారదార్ఢ్యలమీఁద నీరసించు
బలశశిసురాశ్వన్రుషరౌప్య భసితపద్మ, దరకుసుమకాశశేష దిగ్దంతిసింహ
శంభుఘనసారవాణులు జంటలైన, సరియె వేంకటఘనుకీర్తి జాతఘృణికి. 42

సీ. శ్రీసతీశ్వరవాహభాసురశ్రీఁ గేరి కమనీయశరజాతగరిమ మీఱి
వెలయు ననంతభావిద్రుమాభలఁ బోరి శుచిభానువైఖరిసొంపు దేఱి
రమణీయతరమహారజతకాంతులఁ జీఱి గౌరమణిశ్రేణిసారె దూఱి
హంసమండలసముద్యద్దీప్తిఁ బొల్పారి హరిచక్రవిస్ఫూర్తి నలమఁ గోరి
ధాత్రిఁ దనకీర్తి తారుణ్యధామమహిమ, రహివహింపంగ మించు సంగ్రామభీము
వేంగళేంద్రుని వేంకటోర్వీలలాము, భాగ్యసుత్రాము సన్నుతింపగవశమె. 43

*నవగ్రహరత్నరసనిధానసీసము*

పద్మరాగార్కప్రభాభయానకమయి హిమకరతారాద్భుతము ఘటించి
నీలాప్తగురుచక్రనిభశౌర్యగతిమించి శంఖవజ్రోత్తమోజ్జ్వలతనవ్వి
విద్రుమాళిముకుందవీరకేతువు మీఱి కుందతారామందహాసమూని
రక్తాంగవరపుష్యరాగబీభత్సమై కవివిదూరజనూత్రకచ్ఛపాసి
వక్త్రరుచులను గరుణించి వసుధ వెలయు, తనప్రతాపయశంబులఁ దనరువిబుధ
నుతమహాపద్మ గోమేధికతరళశ్రస, గంగశృంగారుఁ డగు వేంకటాద్రివిభుఁడు. 44

గీ. దామరల వేంకటప్రభుదారమణులు, గుణధరణి యయ్యమాంబిక గురువమాంబ
కేసమాంబికయును సతుల్యాభసమాన, లై సమాఖ్యానిధానంబు లైరి జగతి. 45

సీ. తనసహోదరునభ్యుదయమునకు మొగంబు ముడుఁచి పద్మినులపాం దెసాసేని
నధిపుపై సుమనోమయాంబకవ్రాతంబు నించ నల్లునిఁ బ్రతిష్ఠించ దేని
గలహంబె కూడుగా మెలఁగెడు దేశద్రిమ్మరి పట్టి ఘాతక్యాంబు మాన్ప నేని
దను నుద్ధరించు భూదారునీశుని డించి బలవంతులను గూడఁ దలఁచదేని
శ్రీసతిసతిసరస్వతిక్షితియువతినిఁ, బ్రతియనఁగవచ్చు నాజగన్నుతచరిత్ర
కనుచు సాధ్వులు వినుతింప నవని వెలయు, ననుపమగుణావలంబ శ్రీయయ్యమాంబ.

సీ. అలరులకోఱకుఁగా నన్నదమ్ములకుఁ గయ్యంబిడు సత్యసత్యయె తలంప
విభునితో నేకీభవించియు నతనిపై జలచుమాన్పనిసతి సతియె యరయ
నగ్రజుఁ డొప్పని యతివంచకునికి నాలయిన సుభద్ర భద్రయె గణింపఁ
బతిసమ్మతింపని వ్రత మొనరించు సుశీల సుశీలయె క్షితి మతింప
ననుచు వారల చర్యల నపహసించి, సకలబంధు జనంబులు సన్నుతింపఁ
దనరుఁబతిభక్తి నలయరుంధతి యనంగ, భవ్యగుణపేటి గురువమాంబావధూటి. 47

చ. స్థిరమతి యైన యయ్యమకుఁ జెన్నమహీశుఁడు కేసశౌరియున్
హరితరుణీసమానగురువాంబకు వెంగళభూమిభర్తయున్
వరదనృపాలమౌళి మఖవప్రమదాసమ కేసమాంబకున్
గిరిధృతికృష్ణధీరుఁడు జనించిరి కల్పకపంచకం బనన్. 48

సీ. తనభుజాభుజగప్రతాపానలమునకుఁ బ్రత్యర్థికీర్తి పారదము గాఁగఁ
దన ధాటికారటత్పటహగర్జ కరాతిపార్థివావళి హంసపటలి గాఁగఁ
దనగంధసింధురోత్తమముల కరిమస్తకంబు లంబుజకోరకములు గాఁగఁ
దనపదాంగదపురందరనీలమణికి విద్వేషిభూషణములు తృణము గాఁగ

ఎఱులు దామర్లవంశపావనచరిత్రుఁ, డాహవకిరీటి యర్థిదైన్యాంధతమస
భాస్కరుఁడు శోభమానయశస్కరుండు, చెన్నభూపాలుఁ డరిరాజసన్నుతుండు.

శా. ఘోరాజిం దన తేజిఁ దోలి విమతక్షోణీతలాధీశులన్
నారాజిం దెగటార్చి వీరభట సన్నాహంబుతోఁ జేరు నా
నారీజాగజమస్తమున్నఱకి నానావస్తువుల్గొన్న యా
నారీజాలమనోజు దామరల చెన్నక్ష్మాపు నెన్నందగున్. 50

గూఢపంచమ సీసము.

చాపారిజయధైర్య సత్కృపాధర్మము శరజారిధరహారిస్ఫురణమించ
ఘనకీర్తిధామవాక్కాంతిగాంభీర్యము ల్సన్మిత్రగురురత్నసరణి మెఱయ
వితరణనైర్మల్య విభవధీపితృభక్తులభ్రగగంగేంద్రాత్మజాఖ్యనమర
బలభూతిశాంతిరూపపరాక్రమంబులు మరుపీశ్వరకుమారమహిమ వెలయ
మహినిఁ జెన్నొందు నాహవమక్ష్మాధరేంద్ర, మలయనగమధ్యమహితభూమండలాధి
పత్యనిత్యశుభావాప్తిఁ బ్రణుతికెక్క, వేంకటేంద్రుని చెన్నభూవిభువరుండు. 51

సీ. ఇనచంద్రములుగాని యినచంద్రములుగారు జోడు సుధామయశోమహిమల
నచలేశ్వరులుగాని యచలేశ్వరులు గారు సరి సమున్నతధైర్యశౌర్యములను
గోపవృషుల్గాని గోపవృషుల్గారు పురుడు దయాగణ్యపుణ్యములను
జనకమనుల్గాని జనకమనుల్గారు సాటిసన్నయకృత్యసత్యములను
నేఘనునకనఁ బొగడొందు నాఘనాఘు, నస్ఫురద్దాననిమ్నగాన్వహవివాహ
నిరుపమానంద సన్మాననీయవనధి, వేంకటేంద్రుని చెన్నభూవిభువరుండు. 52

సీ. తనకీర్తి విధునిరీతినిఁ బోల్పఁగనుటనో కలశవారాశితోఁ గలసి మెలఁగుఁ
దనసాంద్రధామంబు తరణితీరగుటనో ద్వీపాంతరంబులఁ దిరుగుచుండుఁ
దనవిక్రమము జిష్ణునను వుసమనుటనో యెపుడు సుధర్మాప్తి నింపుగాంచుఁ
దనయీగి సురభిచందమున వర్తిలుటనో సుమనోమనోహారస్ఫురణమించు
ననుచు జనులనుదినమును వినుతిసేయ, రాయసింహాసనసముద్ధరణధురీణ
శ్రీలదామర్ల వేంకటక్షితితలేంద్ర, తనయుఁడై నట్టి చెన్నభూధవుఁడు వెలయు. 53

సీ. చేగలవాఁడంచుఁ జెప్పులవింటరో కాని నాగేంద్రునకు సువర్ణంబులేదు
కాంచనకటకంబు గలవాఁడనుట కాని గతిలేనివాఁడు నగప్రభుండు
కోలముల్మత్త్యాలు గూర్చునంటయ కాని కిటిపాలంబున గింజగిట్టకదుగు
ఘనసరంబులవాఁడు కమఠుండనుట కాని శిశుపోషణకె చింతసేయుచుండు

ననుచు వారల దిగనాడి యవనికన్య, సకలవైభవసుత్రామ సార్వభౌము
దామరలవేంకటాద్రీంద్రతనయసోము, చెన్నభూపాలు భుజపీఠిఁ జెన్నుమీఱె. 54

సీ. మునుమున్న యేరాజు మున్నలిబైళ్లను వేలూరిలింగభూవిభునిఁ గొట్టెఁ
బంచవన్నియడాలు పట్టించె నేరాజు పరవీరభద్రేభపటలి రెబ్బి
ధీరతఁ గూఢలాతూరిలో నేరాజు శాత్రవబలముల సంహరించె
శుక్రవారమునాఁడె చొరఁబాఱి యేరాజు పాండీనిబలముల భంగపఱచె
నతఁడు సామాన్యుఁడే దామరాన్వవాయఁ, కలశవారాశిపూర్ణరాకాశశాంకుఁ
డనఁగ గడికోటమల్లశుభాంకయుతుఁడు, వేంకటేంద్రుని చెన్నభూవిభువరుండు 55

మ. పరిఘాసాధగభీరతోన్నతులచే బల్రాయిడిం జెందియుం
దరియం జాలరు పన్నగామరు లన న్భాసిల్లునాదీప్రవ
ప్రరము న్వేలురిరాజధానిని తృణప్రాయంబుగాఁ గొన్నయ
న్నరనాథాగ్రణిఁ జెన్నభూపమణి నెన్నన్ శక్యమే యేరికిన్. 56

క. ఇలవెలయు నేచభూపరు, చెలియలి నల యక్కమాంబఁ జెన్నక్షోణీ
తిలపతి పరిణయమయ్యెం, జలనిధిసుతఁ బెండ్లియైన శౌరియ పోలెన్. 57

ఉ. శ్రీసతిగీము దామరలచెన్ననృపాలునిసోదరుండు మా
కేసన కీర్తివాసనలకేసరి కేసరి సౌరనిమ్నగా
గ్రేసరి యాసరిద్వరధరించిన మేటియు వాగ్వధూటి ము
క్తాసరి యాసరీసృపజగత్పతియున్ ధరలోన నెన్నఁగన్. 58

సీ. చదువు పద్యమునఁ దా సంఘటించిన శంక కవికోటులకు జిగుర్గండిగాఁగ
గమకింపఁ దాఁ గడకంటఁ జూచినచూడ్కి హస్తినీశ్రేణికి నలుగుగాఁగఁ
గలని కేతేరఁగాఁ గనిపించుహుంకార మరులకుఁ జంద్రోదయంబు గాఁగ
నవరసంబులకు దానిన దానజాలంబు సరసులకును నైన వరవగాఁగ
సురపమాంబామణీగర్భశరధిశుభ్ర, కరుఁడు ప్రతిపాదనప్రథాధరితకల్ప
తరుఁడు వేంకటభూజానితనయపంచ, శరుఁడు దామర్ల వేంకటేశ్వరుఁడు వెలయు. 59

సీ. తనమేధచక్రి దాదంభసంభ్రమమున మెండొడ్డు కుండలిఁ గుండలించుఁ
దనప్రతాపము తిర్యగనుపమఘృణికైతవమున భానుని భువి వైచి విడుచుఁ
దనదానపటిమంబు వనహాపరణమిషోద్ధురతమై సుదుపతిఁ దుదుప్పు పెట్టుఁ
దనకీర్తి తమి చతుర్థప్రహరవ్యాజగతిబుధుకవర్ణము ల్గట్టి పెట్టుఁ
దనగుణము వెట్టులేఖిక దశ చెలంగె, నుక్కొ యొక్కొక చోటుల నుక్కుమిగిలి

విబుధవిబుధాధిపతి గాఁడె వేంకటేంద్ర, సుతుఁడు దామర్ల వేంగళక్షోణిధవుఁడు 60

సీ. బహులాబ్దములవాఁడు మహిదారతిలకంబు చేలత్రొక్కుడులనె జిగిఁదొలంకె
ఘనవర్షములవాఁడు గహ్వరీధరమౌళి కప్పగండెములనె గరిమ దొరలె
ద్విరదనంబునవాఁడు కరియూథనాథుండు మురిపెంపు నడలనె మురువుపడలె
ముసలిదై తగువాఁడు మును సరీసృపనేత తెలిగోరసిగలనె తెలివి గలఁగె
రదకవృద్ధులలోఁ బెద్దమొదల కమఠ, మూర్తికలనేగొనబు వారి నెల్లనను మ
వసుధ దామర్ల వేంకటేశ్వరకుమారుఁ, బంచశరనిభు వేంగళప్రభువరించె. 61

సీ. సత్కులంబును సుప్రజము గొన బుధజాల మునకిచ్చి క్రమ్మఱఁ గొనెడువాని
తను వేఁడు సుమనఃప్రభునిశక్తిఁ గైకొని పీడుకు పీ డొదవించువాని
సర్వజ్ఞుఁ డగునాత్మసఖునకు దుర్వర్ణ మగువాస మొసఁగిన యట్టివాని
గోత్రవర్గములచేఁ బత్రము ల్గొని యప్పు లిచ్చుటకై చరియించువాని
రాజు రారాజు చెలియును రాజరాజు, ఘనుఁడునను పెట్టులంచు నకారణోప
కారముగ నర్థ మొసఁగును ధీరతతికి, మనుజమాత్రుండె వేంగళక్ష్మాపరుండు. 62

మ. కలనైనం దర మింత పూనకడకింకై యొగ్గఁ డొక్కింత క్రో
కలు బంగారముచేసికోఁ బదికినం గాంచింగరంబస్తిగా
నిలకుం డెల్పఁగఁబోఁడు కంచివరదుం డెట్లోపు దామర్ల వేం
గళభూనాయకు వేంకటాద్రిశరవక్ష్మానాథుతోఁ బోలఁగన్. 63

శా. కృష్ణాగౌతములం బ్రసిద్ధములు కోకిబాంధవప్రోద్భవా
కృష్ణాకారనికారణప్రకటముల్కృష్ణార్వగర్వచ్ఛిదల్
కృష్ణాపదరదోర్ధరాభిమతము శ్రీవేంకటాధీశు మా
కృష్ణాధీశ్వరుకీర్తిచంద్రికలు చంద్రీభూతఖద్యోతముల్. 64

క. ఈపుత్రులఁ గను వేంకట, భూపాలకుఁ డతఁడు వెలయుఁబుడమిని నువ్వ
చ్చాపలతారోపశతా, టోపహతారాతిభుజపటుప్రాభవుఁడై. 65

క. ఏతాదృశశుభచర్యున, కాతతభుజశౌర్యునకుమహౌదార్యునకున్
నాతాశన జాతాసన, జాతాభినవప్రతాపచాతుర్యునకున్. 66

క. సంధాభృగునందనునక, బింధనగంధసహబంధుహితతేజోని
గ్గంధితగంధాంధరిపు, స్కంధావారాంబునిధికిఁ గవిసేవధికిన్. 67

క. శ్రీలక్ష్మీపతిసేవా, శీలునకున్మదవిపక్షశిక్షణకలనా
లోలునకుదయాలునకు, న్వాలూరిపురపతికి నవారితధృతికిన్. 68

క. జడరాశిగభీరునకు, న్బడబానలకీలసదృశబాహుమహునకున్
గడిగోటమల్లబిరుదున, కుడుపరివృఢకీర్తితతికి నూర్జితమతికిన్. 69

క. ఘోరమహోదారమహో, దారమహోన్నతవిరోధిహతిచణునకునుం
దారవనీగౌరవనీ, హారవనీ వంచికీర్తిహారగుణునకున్. 70

క. నాభాగనిభున కంబుజ, నాభాగమబోధధుర్యనకు దశదిక్సా
నాభాగతతయశస్సా, నాభాగరిమాతిశయున కధికజయునకున్. 71

క. ఆంధ్రధరానాథునకుంబు, రంధ్రీపాంచాలునకుఁ గరకృపాణాలగ
త్క్రాంధ్రపరిపంథిపార్థిన, రంధ్రితదినమణికి మతిధురంధరఫణికిన్. 72

క. కోర్క్రొండసింహబిరుదున, కర్క్రప్రతిబింబభుజమహాప్రకరునకున్
గర్క్రశరిపుహృత్తికి శుభో, దర్క్రునకు వేంకటాద్రిధరణీపతికిన్. 73

క. కామితఫలదాయకునకు, రామామదనునకు దానరాధేయునకున్
దామగలవేంకటేంద్రసు, ధీమందారునకు వారిధిగభీరునకున్. 74

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన బహులాశ్వచరిత్రం బనుప్రబంధరత్నంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన.

ఉ. శ్రీశుకయోగిఁ గన్గొని పరీక్షిదిలాతలభర్త కర్తయా
దాశరథిం దలంచి పరతత్త్వముఁ గన్న ఘనుండు శత్రుశై
లాశనశౌర్యశాలి బహులాశ్వుఁడు తచ్చరితంబుఁ జెప్పవే
దేశికచంద్రమా యనఁగఁ దెల్పెఁదొడంగె మహర్షిహర్షియై. 76

క. ఆహవమోహవశంవద, బాహావబలభటము మిథిల పదిలంబగు శ్రీ
గేహంబై భూదేవీ, దేహంబై తగువిదేహదేశములోనన్. 77

క. ఆవీడు దనకు వేలుపు, దావీఁడు ధరాపురాళిఁదలఁతురె యనుచుం
దావీడుభోగవతినిసు, ధావీడున్నతయశఃప్రతాపోజ్జ్వలమై. 78

సీ. ఆప్రోలివిప్రాళి యాగశతప్రీతి నందింప విధి శతానందుఁ డయ్యె
నవ్వీటినృపకోటి యసురక్షితికి సేనఁ జేర్చ నింద్రుఁడు సునాశీరుఁ డయ్యె
నాయూరిబేహారి హావణించు పొత్తుబేరపుఁగల్మి యక్షుఁ డర్థపతియయ్యె
నాగ్రామహాలి ప్రేమహాల మొసంగినఁ బ్రబలంబుధ్వంసకుఁడు సీరపాణియయ్యె
నచటఁ జదువంగ గీష్పతి యయ్యెజీవుఁ, డచట గణియింప హేమమయ్యెయమరెనమఱి
యచటిపూఁబోఁటులఁబుష్పాస్త్రుఁడయ్యె మదనుఁ, డచటినిధివిధివసుమతియయ్యెజగతి

మ. ఉడుమార్గంబున నిర్గమించుశశిలో నున్నట్టి న్యగ్రోధమున్

గడిగొమ్మంచుఁ బెకల్పఁబోయి కిరణౌఘంబు ల్వాయిం గ్రమ్మిసన్
గడలంచుం గడలన్వడిన్వడల శుండాదండముం ద్రిప్ప న
య్యెడ నప్పట్టనపంతికిం దొలఁగురాత్రీశానుఁ డెప్పట్టునన్. 80

చ. సగతులువట్టి వెంటఁ బరిచారకులేగి హయంబు మించిపో
జగతి ఖురాగ్రము ల్వడమి జూడ యెఱుంగక వాజివేగముం
దగిలెదనంచు వెన్నను సదాగతి కొట్టునఁ బోవునబ్బటు
ల్పగలిటి కందుకొండ్రు త్రుటిఁ బాఱుచు నిల్చిన తత్పురాశ్వములన్. 81

ఉ. పంటవలంతి యల్లుదొరపట్టము మట్టినచిత్రశాటి యిం
టింటను లేనిప్రాణులుఁ గయి న్రఘువీరజపాత్రుదామకం
బంటనిదేహధారులుఁ బురారిధనుర్దమనప్రచండు పే
రింటను బిడ్డఁ బిల్వనిశరీరులుఁ జొప్పడ రప్పురంబునన్. 82

చ. తనపురి ముందు క్రిందుపడదన్న నగద్త్రకుఁ జేలికొంచు వే
చనియెదనంచు నమ్మిథిలఁ జక్కఁగఁ జుట్టి పురారిచాపమ
ర్దనచణునత్తవారినగరం బని యెంచి హితుండపోలెఁ గా
చినపలునోటిచిల్వ యనఁ జెల్వగు వజ్రపుఁగోట వీటికిన్. 83

మ. నగరీసౌధశిఖావధూమధురగాన శ్రీద్రవద్రత్ననీ
రగణం బాత్మశిరోగృహం బవియ గీర్వాణీతతుల్వాన క్రిం
దుగృహాధోగతుఁ డిందుఁ డైందవశిలాతోయంబుగాఁ దస్పెరిం
గిగణించు న్సరిగూడుమేత నడుచక్కింబాడ నక్కొమ్మలన్. 84

. కన్నులజిగి చన్నులబిగి, వెన్నులయొగి కప్పుగుప్పు విప్పుంగొప్పుల్
పన్నెలనగవు న్నెలమొగ, మున్నెలఁతగముల్లను న్రభుల్మెచ్చఁ బురిన్. 85

ఉ. అందఱు మందగామినులు లాయారులు తేటమిటారి కత్తియల్
చందురుకావిమోవి పలుచందనపుందుక మొందు నందపుం
గెందలిరాకుబోఁడులు శుకీపికవాణులు కంజపాణు లిం
దిందిరవేణులెందున ననింద్యలు చందనగంధు లప్పురిన్. 86

ఉ. కట్టినకోకఁ గట్ట దొక కాంతయు నొక్కవధూలలామయు
న్బెట్టినసొమ్ముఁ బెట్ట దొకభీరువుఁ బూసిన పూఁతఁ బూయదొ
పెట్టెఁడుచీర లంగజుఁడు పెట్టినఁ బిల్చినవానిఁ బిల్వర
ప్పట్టనపణ్యభామినుల భాగ్యమె భాగ్యము భోగ్యనస్తులన్. 87

సీ. తోడనిగ్గులకు రంభ తోడ్తోడఁ దలవంప శశిరేఖ మొసలికి సగము గాఁగ
దరహాసమునకుఁ జంద్రకళ వెల్వెలఁబోవ నెమ్మోమునకుఁ గలానిధి కృశింప
మ్మనుతిలోత్తమ మిం ముముక్కుతేటకు వాఁడ హేమ మెచ్చుగ నెమ్మెయికిఁ గరంగఁ
దతబాహుల కనంగలతిక కొండలు ప్రాక నరిది మాఘ్రులకింత హారిణి బెదర
ఫలముఁ గొని పల్లవావలిఁ బాసిపోక, యలఁతిగాక పలుకఁ బోర కెలమి విడక
పడక వన్నియ దరుగక పచ్చఁదనము, పీగక నలంవసులకుంద్రు వేశ్యలచట. 88

సీ. వెలయిూక విరిబంతి వెలఁది దాఁచఁగ నేల యది హెచ్చు మిూబోంట్ల కబ్బ పెట్లు
కొన్న మేమే కాక యున్నవారల కౌను యింటియతండు నీకంటె భోగి
యటులైనఁ బచరించి యంగళ్ల నిడనేమి యంటి నొండక రొక్క మంపితొక్క
రాలెక్క కిన్నడి యూలేమె వెలయెంత వేడుక కెవ్వాట వెలయుఁ గలదె
యనుచుఁ బౌరుల యుత్తరంబునకుఁ దగిన, నర్మగర్భోక్తులాడి మనంబుఁ గరఁచి
చల్లప్రొద్దున నరవిరు ల్నరులు గట్టుఁ, దలిరుఁ బ్రాయంపుఁ గొమ్మ ముత్తెంబులచట.

క. అన్నగరిం బహులాశ్వుం, డెన్నఁగఁ బ్రతిష్ఠ నేలు యశోవి
చ్ఛిన్నకరికంధరుండై, పన్నగరిపురాట్టురంగపదభృంగంబై. 90

సీ. అపరంజిగవిసెన త్రిపురాపహారిచాపంబున కెవ్వానిభవనభూమి
యర్థాంగలక్ష్మి యిందువ్యగ్రమూర్ధసుర్విదారి కెవ్వాని యుత్సంగశిశువు
ప్రజ్ఞానరుచిదాత్రి బాదరాయణకుమారునకు నెవ్వాని నిర్దోషధిషణ
ప్రాంచత్కుటీకోటి ప్రాణినేత్రాంబురుద్ద్వయము లెవ్వాని కూటస్థమణికి
నిట్టి మహిమల మహనహికెక్కినట్టి, జ్ఞానజనకుని వంశరత్నంబు నూత్న
కీర్తినరకేసరివిజిత కార్తికేయ, జనకుఁడనమించు బహులాశ్వజనకనృపతి. 91

సీ. పితృశిక్ష కొప్పక వెలయుప్రహ్లాదుండు పొరవెట్టనియట్టి నారదుండు
తనశక్తి వోఁజేసికొనని వసిష్ఠుండు రతిఁ బగల్గొనని పరాశరుండు
కాశికాఖండోక్తిఁ గైకోని వ్యాసుండు జనకవృద్ధవృత్తి నొత్తనిశుకుండు
పారణఁ గొనఁ ద్రిప్పని యంబరీషుండు పెరుమాళ్ళవిడని విభీషణుండు
హరిచరణచింతమఱనిరుక్మాంగదుండు, పృథులగురుధిక్కృతికిఁ గాని భీష్ముఁడతఁడు
శౌరిపదభక్తిలేనిభూజానిమగఁడు, తగఁడు బహులాశ్వముదిరాశ్వప్రెగడనుగడ 9

క. అతనికిఁ బురోహితుండగు, శ్రుతదేవుఁడు మఖముఖాన్న శుచిరుచిపరిపా
లితదేవుఁడు నతజీవుఁడు, స్తుతభావుఁడు రచితనందసుతసేవుఁ డిలన్. 3

మ. శతభానుప్రతిభానుమూర్తి, గిరిజాజీవేశజూటీతటీ

యుతసూనప్రతిమానకీర్తిఁ బహుళాశ్వోర్వీవిభుం డాప్తగో
హితభావ స్తుతభావశాలి శమభూయిష్ఠప్రతిష్ఠాగతిన్
శ్రుతదేవక్షితిదేవమౌళి తగువిష్ణుధ్యానవర్ధిష్ణుఁడై. 94

ఉ. ఆసుజనస్తుతుండు బహుళాశ్వుఁడు కాశ్యపి నేల నొక్కెడన్
వ్యాసవసిష్ఠవత్స భృగువత్సపరాశరముఖ్యతాపసా
గ్రేసరులేగుదెంచి నృపకేసరిచే సుమపూజలొంది త
ద్భాసురభక్తి కుల్లమునఁ బొంగుచు నిట్లని రందఱుం దగన్. 95

ఉ. చుక్కలరాజ వీగి మధుసూదనపాద సరోజపూజలం
దక్కవగాని మేటి బలితాతవు ధాతవుహృద్యవిద్యలం
జక్కఁదనంబున న్మదటిచక్కెరవిల్తుఁడ వీడుజోడు నీ
కొక్కని విన్న కన్న ప్రజయుం గలదా బహుళాశ్వభూపరా. 96

ఉ. ఇంటికిఁ దోడితెచ్చి తనియించితి పూజల కల్మికల్కి వా
ల్గంటికి గంటిగట్టుదొరఁ గన్గొనవచ్చిన భాగ్య మిచ్చటం
గంటిమి మేమటంచుఁ దెలుగంటిదనాయనివంటి రాజము
క్కంటి నుతించి ద్వారవతిఁ గాంచుటకై చని రమ్మునీశ్వరుల్. 97

చ. చని మునికోటి తేఁటి యెలజవ్వనిపాటలు గాడ్పుటాటలుం
బనుపడు పూవుఁదోటలను పాటలగంధులు పేల్చు పేటల
న్వనరుహరాగహాటకకవాటలసద్ద్యుతిఁ గన్నకోటలం
దనరిన ద్వారకానగరి ద్వారముఁ దాఁటి పురంబుఁ జూచుచున్. 98

ఉ. అక్కడ నొక్కగంధవొడియంగడిఁ దొల్లి సుమాపణంబు లీ
చక్కి నమర్చినారు గిరిజాప్రియనూతికి తొంటిరీతి గా
దెక్కుఁడు వైభవంబు పరమేశ్వరు గోపుర మీపురంబునం
జుక్కలఁ జూచె బచ్చలఁ జూపిరొ యచ్చటిగచ్చుటోవరుల్. 99

మ. ఇదిగో సాత్యకి మేడ క్రీడిసదనం బీ బ్రాహ్మణశ్రేణిఁ జూ
పదియైదిండులు దాఁటి నిట్టటు బలప్రాసాదమాసంది నే
కదగగ్గాలయమశ్వకోటి శకటిగ్రామంబులం గాంచె శౌ
రిదయం గాంచినవారిపట్లకును శౌరింబోల నేరీదొరల్. 100

మ. అనిపూలంగడి దాఁటి కోటిపడగల్ యత్నంబునం గన్న వై
శ్యనివాసంబులు త్రోవపట్టి మొదట న్సాంబాలయంబుం గనూర

గాని ప్రద్యుమ్నుని హర్మ్యమ్ముం గడచి యగ్రహారాంగణం బంటి యొ
య్యన వేయంచులకైదువయ్యాయిలు డాయంబోయి హర్షించుచున్. 101

సీ. గోత్రారికరికైనఁ గొమ్మిచ్చుటయె గాని యలుకెఱుంగని మదావళకులంబు
లవణాంబునిధినైన లంఘించుటయె కాని కుఱుచదాఁటెఱుఁగని ఘోటపటలి
గంధవాహమునైనఁ గడువఁ బాఱుటె కాని యనికుంటునడని శతాంగవీథి
కంఠీరవమునైన గరిసించుటయె కాని యొరసివెన్నిచ్చని భటోచ్చయంబు
ప్రమణనిబిడబిడౌజాగ్రపరిబృఢప్ర, గాఢసిబికాధికాందోలికానికాయ
కేతనచ్ఛత్రసంఘాటఖేటనిరవ, కాశమహిబహిరంగణగరిమఁగనుచు. 102

ఉ. ఎక్కడిపుష్పకంబు మతియేటిసుధర్మ సుమేరుకందరం
బిక్కడ శిల్పిరాక్క పొడవెంత యహోనిడివిన్నెవల్లవమే
లొక్కొకయంకణంబె యదియుం బదివేలకుఁ జాలుజాళువా
చొక్కపుటీకు లెక్కడని చూచి హజారములోనఁ జొచ్చుచున్. 103

సీ. రుక్మిణీపరిరంభరుచిఁ దగుల్కొనినాఁడొ సత్యభామాకేళిఁ జాలినాఁడొ
లక్షణావీణాకళావాంఛ నున్నాఁడొ కాళిందిసందిటఁ గదిసినాఁడొ
మిత్రవిందాలాస్యమె మెచ్చుచున్నాఁడొ భద్రారతిశ్రాంతి బడలినాఁడొ
జాంబవతీరదచ్ఛదమానుచున్నాఁడొ యలసువంతాక్రీడ నలరినాఁడొ
లేక రాధాసుధాధరాస్తోకధరణి, ధరపయోధర ధగద్ధగితగండ
తలమృగీమదమకరికాపలకములకు, హరువుగనినాఁడొ యని మునీశ్వరులువలుక. 104

సీ. సిగమొగ్గ తెలినిగ్గు జిగిదన్ను నిరుచుట్టు వెనుకకట్టు రుమాలు వెలికిఁ గ్రమ్మ
నొసలుక్రొన్నెలకొల్పుపసగన్న యరవిరి కలువనామృగనాభితిలక మమరఁ
గుంకుమం బెపదిద్ద గొలుసింత త్రిప్పి యంసమునవ్రేచిన కౌస్తుభము నటింప
డావంకభుజపీఠిపై వింతనడికట్టు చెంగావిబంగారు చెఱఁగు గదలఁ
దళుకుహురుమంజి నిడుయొంట్లు దాల్చిహళిది, పట్టెసమ్మాళిగెలకవమెట్టిపాణి
పాణిముత్తెంపుఁ బరజుకృపాణిపూని, చక్రివనుదెంచె నపుడు హజారమునకు. 105

గీ. దండసాత్యకిరాఁగ సైంధవవిరోధి, దండనూద్దండభుజుఁడు కైదండయొసఁగ
వచ్చి యచ్చక్రి తావు తివాసిమీఁది, పచ్చగద్దియఁ గూర్చుండి ప్రజభజింప. 106

గీ. ఒక్కచేత్రమొక్క కేల్దోయిమ్రొక్క నొక్క
కరముసామ్రొక్క తలమ్రొక్క కన్నుమ్రొక్క
నుచితగతిమ్రొక్క దృక్పాణిరచనమూర్ధ

నియతిఁ దగువారిఁ గూర్చుండ దయ వలంచి. 107

సీ. ఎదురుచూపునకు దిగీశ్వరుల్ కైదట్టి వెఱచిరెండడుగులు వెనుకకిడఁగ
వలప్రక్కఁ జూడ్కి కన్వల యాదవాగ్రణుల్ బగ్గున నిరువంకఁ బాయమొసఁగ
డాచక్కిఁ జక్రిచూడకమానఁ డని మున్ను బలగముల్ బారెఁడు బయలు విడువ
వేత్రమెత్తిన వ్రజికత్రిదశులు గళన్ముకుటులై యొకరిపై నొకరుద్రాల
మునుల గొల్లలు సావిడినునిచి విన్న, వించనేతెంచి యుద్ధవుఁ డించుకలికి
చెంగటభజించు దొరలమరుంగుఁ గోర, బలిసి కొలువుండె యదుసార్వభౌముఁ డపుడు.

క. శూరకులపావనుండు హ, జారమ్మున కేగుదెంచె సంయమివర్యుల్
రారయ్యాయని పిలిచిన, వారయ్యాదవుని సచివవచనము వినుచున్. 109

సీ. ప్రభుగోష్ఠి వేగిరపడకు విశ్వామిత్ర వాల్మీకివాణిలోపత్తుఁగాని
భరతప్రపంచంబు హరి యెక్కుడెదుగునో జడియక యుత్తరం బిడుము పులహ
యొక్కచోఁ దర్కోక్తిఁ ద్రొక్కుడువడుదీవు తెచ్చుకో నెమ్మన కిచ్చ వత్స
యొక్కొకరె ప్రసంగమొసఁగెడుచోఁ గొంద ఱష్టగర్జులు వలదత్రిహాని
శాస్త్రసాహిత్యములు మాకె చాలజీత, మంచుఁ గలగూరగంప నేయకుము బాద
రాయణ కవిత్వసందర్భరసము నిలుపు, మనుచు దౌవారికద్వార మపుడు దాఁటి.

సీ. పదిలమ్మ సుమ్మ నీపాణిపాణింధమనారికేళము దర్శనంబు తఱిని
జతనంబు మీకరాక్షతములు శౌరి యంజలిచూచి జడియకొసంగు చోట
నిద్దఱు నవధాన మీపూర్ణకలశంబు మురవైరిశిరమున మోపునపుడు
మీరలెచ్చరిక యీమృదుకాయమానమృద్వీకానికాయదాతృత్వవేళ
నాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి, రస్తుభవతామటంచుఁ గంసారిఁ జేరి
పెద్దలాశీర్వదించిన పిదపఁ జిన్న, లనుఁ డటంచును నాస్థాని కరుగుదేఱ. 111

ఉ. చూచి మరీచిముఖ్యులఁ బ్రసూనశరాసనతండ్రి దిగ్గన
న్లేచి నమస్కృతుల్ చలిపి తీయపుదీవన లంది కానుకల్
కై చిగురాకు సాచి దయఁ గైకొని తానుచితాసనంబుల
న్మేచకవర్ణుఁ డుంచి మునినేతల కిట్లనియెం బ్రియంబునన్. 112

శా. ఏమీ సంయమిసార్వభౌములు శుభంబే హవ్యకవ్యక్రియా
సామర్థ్యంబునఁ దొంటి యట్లనెకదా శక్రాహితశ్రేణిచే
బాముల్రావుగదా ముదాస్పదములై భద్రోన్నతుల్ బ్రాపెడున్
మీమీ మోములె యంతె చాలు నివిసుమ్మీ నేఁడు మాకిష్టముల్. 113

సీ. భద్రమా మీయాశ్రమద్రుమాంతరధరాచరతరక్షుకురంగసఖ్యములకుఁ
కుశలమా ఫలసమిత్కుశలమాదానదీక్షాపరకీశవిశ్వాసములకు
భవ్యమా మీనవ్యూహవ్యమాధ్వనంజయగ్రప్రదక్షిణజ్వాలికలకు
క్షేమమా సామజోద్దామమానత్రాతకైదారనీవారగర్భములకు
బాలికాపాలికాబాహుపాలితాగ్ర, శాలికామాలికాసన్నసకలబుతుభ
రితసుమకదంబశాఖికారేఖికలకు, సుఖమె యన నిట్లనిరి వ్యాసముఖులు హరికి.

శా. రాధావల్లభ యెల్లభద్రగుణముద్ర న్మీరు మన్నింపఁగా
మాధర్మంబునకుం గొఱంత గలదా మత్తిల్లి యుష్మత్కథా
బోధంబొందితి మెక్కుడం బొడిచితే ప్రొద్దా యటంచున్ సుఖ
శ్రీధన్యస్థితి రామరాజ్యము వలెం జేయొమ్ము పైఁ జెప్పుమీ. 116

సీ. ఇప్పుడు చెంకూర్చు నీకౌశికవ్రతి యచలస్థితి వహించె నయ్య భృగుఁడు
నినుఁగూర్చి చెట్టుకట్టెను గాలవతపస్వి ప్రబలించె రుచి మందపాలవాని
మంచినడకఁ గాంచె మనజాలపాదర్షి వగ నెపవహకుండె వత్సయోగి
విరివికాఁడై గాదవిలె వ్యాసజటిమాళి మదితమం బెషలించె మతి మునీని
నడచె భువనప్రసిద్ధుఁడై నారదుండు, తనరఁ బరికొనెనుతి నరతంతు మౌని
నీదుకారుణ్యమున సుఖాన్వితులు వీర, లిందఱు ముకుంద హరి మునిసంపదరద.

శా. మీదాసాగ్రణు లెక్కుడం గలరొ భూమిం జూత మన్నట్టి మే
ధాదక్షత్వమె కాని లేవితరచింత ల్త్రోవ నేతేరఁగా
వైదేహక్షితిఁ గంటి మయ్య బహులాశ్వక్షోణిభర్తన్ భవ
త్పాదాంభోరుహభృంగము న్భవభరాభంగగ్రుమాసంగమున్. 117

శా. కన్నుల్పల్లఁగఁ జూచినార మతనిం గారుణ్యము న్శాంతిచాం
త్యౌన్నత్యమ్మును జిత్తశుద్ధియుఁ ద్వదీయధ్యానసంశుద్ధియుం జ్
ద్వన్నామార్పితబుద్ధి వానికి తగుం ద్వన్నాభిఁ గన్నయ్య యీ
యున్నయ్యల్మనసంయము ల్త్వాగడలే రుర్వీసుపర్వేందునిన్. 118

సీ. కొలువులోపలఁ బంటవలఁతికన్నియపెండ్లికొడుకుపే రెన్నిక విడనివాఁడు
తలఁపులోఁ దబిసి బిత్తరిజాతివగత్రోపుఁ దెలుపుజే జేసిల్లు తలఁపువాఁడు
పలుకులో మున్నిటి జళుకుటీగిలకోరిబల్లిదుకత పల్కుబముబవాఁడు
నిదురలో హొంబట్టు నెఱకట్టురావేల్పు వలచుట్టుపోహారు కలలవాఁడు
తండ్రిపేకటివొరలిడ్డాశగులమునకు, పిల్లువిల్తినినవేటికి విన్నవించు

కబ్బములవాఁడు నీవన్న సుబ్బావాఁడ, తండపోదేవరకు సమ్మఁ దగినబంటు. 110

క. ఇల కేఁడు బాదరాయ, ణ్యలఘుప్రౌఢిమ నటుండు మనియె న్మనియె
బలిబలె శౌనకశమనము, కులనైపుణి పుణికి పుచ్చుకొనియె మురారీ. 120

క. నావుఁడు దేవుఁడు వలికెం, దావాల్మీక్యాదిజనమునకు బహులాశ్వ
క్ష్మావల్లభు నెఱుఁగుదు మ, ద్భావంబునఁ గలిగినదియె పల్కితి కీరల్. 121

శా. చూడం బోదము చుండు టేఁపు మనమంచుం బల్కి యమ్మానిస
త్రమాదుత్తంసులఁ దొంటి యవ్విడిదిఁ జేరంబంచి వైనంబుఁ దో
డ్తోడ న్రాణువ కెల్లఁ జెప్పి కొలువందుం దీటి సాహోరవ
క్రీడావైభవ మొప్పఁగా నగరు చేరెం జక్రి మోదంబునన్. 122

## అశ్వాసాంతిపద్యములు.

శా. జ్యేష్ఠాషాఢనిరూఢ తిగ్మకిరణౌజస్స్పర్థి దోస్తేజ బిం
బోష్ఠీలోకవిలోకపంచవిశిఖా యుద్దామదానక్రియా
షష్ఠాఖండలభూజ రావణభుజాసంఛేదనాయోధనా
ధిష్ఠారాధన శ్రీసుయోధన ధనార్థిస్తుత్యనిత్యోదయా. 123

క. జంబూద్వీపకవీంద్రక, దంబకదంబకనవాంబుధరవిశదయశో
బింబీఫలాధరాకరి, జంబీరీకృతసమస్తజలజభవాండా. 124

విరాజవిరాజితము. వితరణజృంభణశక్రతరుక్రమ విక్రమనూతనశాతఘృణీ
తతరణబృందపురందరనందన ధన్యమహీమహిళాగ్రహిళా
యతభుజగాగ్రభుజాగ్రమహోగ్రజయాంక నిజామళహైహయలశా
కుతుపనశాహసమాగతిహాటకఘోటకఝాటకరిప్రవరా! 125

## గద్య.

ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్రకరుణానుగ్రహాశాశ్వతైశ్వర్య ధుర్యతామహేశ్వర యూ
పరేఖావిజితరతీశ్వర సరససంగీతసాహిత్యసకలకలావిచక్షణ సమాశ్రితవిద్వత్క
విరక్షణదక్షవీక్షణ యినిగెలగోత్రపావన పరిపంథిరాజకల్పితపావసేవన
దామరల వేంకటాధీశపుత్ర చెన్నభూపాలకలితసౌభ్రాత్ర గురువమాం
బాగర్భశుక్తిముక్తాఫల గురువనజసంభవభవశేషభాషామనీషా బల
ప్రహ్లాదినాగతార్థిజనవరప్రదాయక వేంగళనాయకప్రణీతం
బైన బహులాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# బహులాశ్వచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీపాదవంశవన్నృపతిసు, ధాపారావారపూర్ణతరధనళోభ్యుణీ
శ్రీపరిణీ కరుణాశ్రీ, డాపటిమవిశాల వేంకటక్షితిపాలా. 1

క. ఆనుఋనాఁడు మురారి, మహామహిమన్మహితభూషణాలంకృతుఁడై
హేమాంబరధరుఁడై స, త్యాముఖశశిముఖులతోడ హర్మ్యము వెడలెన్. 2

వ. అప్పు డప్పుండరీకాక్షుండు కక్ష్యాంతరంబులు గడచి దౌవారికద్వారంబుల నడచి హజారంబు మించి ఘంటాపథంబంటి చిరంటీకురంటికామోదలతో చేతేరఁ ద్వారో త్తిష్ఠదానమదాపణవణిగ్గణంబుఁ దదాకూపోదకకుండికాకంఠరజ్జుసంధానసంజవనని షద్యాణుమధ్యాసముదాయంబుఁ దదానీంవారివిక్షేపణక్షిప్రవేశ్యావారంబుఁ దత్కా లశోధనీశోధనపర్యటదర్యభార్యానర్యంబు సవ్యసమ్మార్జనీధూతప్రఘాణపాంసూ రవ్యాహంసయానావతసంబుఁ దత్సమయతోరణనిర్మాణసూత్రసంచరత్కిరాటసంఘా టంబుఁ దదవసరరంభాస్తంభసంభ్రమభ్రమదూరుసంభవంబు సహసాకరాంభోజపు టీనిపీడితపటీపటిష్ఠతాయష్టిసంపాదనబహుభాగ్యవాధావమారుజవ్రజం బితరేతరస్థ లకలహకులాకులకలకలకలకంఠీసవినవివిధసౌధయూధసందష్టృసర్వసర్వంసహాధిప సారసలోచనాచయంబు కించిదాచ్ఛాదితకవాటపీఠభాగభాస్యసామాన్యరాజన్యక న్యకాబింబోష్ఠికంబు ప్రకోష్ఠనిష్ఠితనిష్ఠురశ్వశ్రూకుటిలభ్రుకుటీకుటిలాంతర్నివారిత విలాసినీసువాసినీవిసరంబుఁ బ్రసరత్పల్లవపల్లవపుంగవాపాంగనటనరంగాయితా త్మాంగతానఖరపరిష్కృతకచబంధబంధకీవేశ్యానికాయంబుఁ బశ్యదనూన్యంపశ్యా పస్యమధ్యమాసమాలోకనభ్రమాగతకిరీటవనిపహాంబనేక వేత్రపాణిపలాయమానమానవ ధావనవినోదనసముత్కటంబగు పుటభేదనంబునడువీథినడతెంచునెడఁ గలువడంబులు తేనియొడ హాసనమ్రఖంబుల చామరముకురంబులు వోసంగించుచు లసన్నఖంబుల నిరలంకృతిప్రాంగణంబులకు మౌక్తికరంగవల్లికలు సింగారించుచు నక్షీణక్షణక్షణ వీక్షణక్షణదాధ్యక్షాతపాచ్ఛతరచ్ఛవిచ్ఛటల నమండితప్రతోళికిఁ బాండురతో యజతోరణంబులు పొంకించుచుఁ దాటంకనిరాతంకధగద్ధగితకపోలపాలికలం గన ద్ధవళవితానపటలంబులకు జిలుఁగుటుదిరిపని ఘటించుచు హాట్టంబులువట్టివచ్చుచర

ణఘట్టనసముట్టంకిత ఝుణఝుణనిక్వణచిక్కణమణినూపురకాపురంధ్రులతో గోపు రంబుఁ దాఁటి నలువంకఁ దారదారసిలిన దారల నుదారలం గల్యాణులం గల్యాణపల్యం కికారూఢలం జేసి సత్యాముఖమితవనితాజనతా సమేతంబుగా ఫలితమనోరథుం డై రథంబెక్కి చక్రిచనుమ జనపదంబులు గనుచు తపనపదంబులు మనుమ సాను రాగకమనఃకమనంబైన మార్గభూమ్యుభయపాళీభూతభూభునసవనభుగ్భామినీడిం భకకదంబకంబు భజనంబున కానకదుందుభినందనుం డభినందించుచు ముందఱంగాని చని మంచపట్టులం గడంగి తొంగలించిన చెంగలి మేసి చెంగలించి చెంగక చెంగ టఁ జెంగనాలం బొసంగు నాలకదుపుల దయచేతం గనుంగొని జల్లియొడలు పలుచ నితొడలు కుఱుచకొమ్ముల తెఱంగు నిడుదవాలంబు బెడంగు గాఁగెడుపాలయొను గు కాఁగెడుపాలపొదుగు మొదవులలో మెదుగుయదుకులభర్త కీర్తించుచు వర్త్మ నింగైకొని కార్తస్వరవికస్వరరత్నశతాంగసంగతపతంగరాట్కేతననూతనచేలాంచల సంజాత సంఘాతఘాతసముత్పతద్వ్రతలాన్వితనానాతరంగరేఖాశిఖాతరణి శశాం కాకరలుకత్కైరోరకమతపాథోరాశిదేశీయతటాకఘటాకల్లోలినీ పరిషలు గని ప లికించుచు సపరిమితపరిమళమిళిత పరిపుల్లరినల్లికామతల్లికానల్లీవేల్లితమకరంద నికరేందిరానందితుందిలేందిందిరబృందగానకందళీసందోహసంధానధురంధర గంధ వహోపహృత ఘుగ్మఘునరసనిబంధనాత్మసౌగంధికకహ్లారగంధసారమకరికాసంఘాయ కుండై యాదవగంధసింధురంబు బంధురాటవీవాటికలుదాఁటి ఘాటీలటహాపటహ రటనపాటవపాటితదిక్కటాహకరహాటమరహాటలాటభోటాంగబంగాళ నేపాళ భూపాలకోపాయనంబుల కతిశయిల్లుచు కతిపయప్రయాణంబుల హూణకాశక రూశంబులు వాసివాసిగాఁగోసలదేశాధీశానుండు విదేశాపురిం జేసిన విడిదిప్రవేశిం చునవసరంబున. 3

సీ. బలభద్రప్రబృంహితాసులభద్రధీమరూఢబలభద్రభద్రేభపటలి నడచె
మసారవిక్రమాస్పదసారథితురంగగదసారణశతాంగగణము గదలె
ననిరుద్ధయుద్ధశౌర్యనిరుద్ధపక్కృతి వైర్యనిరుద్ధయోధ్ధచయంబు చనియె
పరసాంబకైకీకృతరసాంబరాన్వీడంబరసాంబఘోటకపటలి వెడలె
ద్యుమ్నమణినూపురాంఘ్రిప్రద్యుమ్నుఁ డతఁడు, రతిసతీవేణీసమకళారసికపాణి
చక్రజఘనాఘనాపాంగచక్రిచాక్రి, ఒక్కఁ గుఱుచలు ద్రొక్కించెఁ జక్రియొదుట.

సీ. అదరుఁ గ్రొవ్వులఁ దేజిబెదరించి రవితేరు గడియలోఁ బసమటిగట్టుఁ జేర్పఁ
బ్రస్ఫురథధ్వజరాజిత్రిపశాంగములు ముంచు తురగఖురోద్ధూతధూళిఁ గొట్టఁ

జలధిభ్రమణముల్ శౌరిపర్యంకలగ్నగ నేచరశ్రాంతిఁ గడకు విసరఁ
గడలచిమ్ము లమర్త్యగణవిలోకనిరోధి జలదంబు దొంతికి తొలలు సేయ
సకలసన్నాహికలఁగన్న సైన్య మన్య, మాన్యరాజన్యభృత్యసామాన్యజన్యఁ
దట్టియొడఁ బాంచజన్యాంకుఁ పెరుగదేఱఁ, బదవిశోక యింత యిరుచెంత బారుదీఱె.

సీ. పారూష్వపదలంబితామ్రమహాపశ్రేణి మసృణబంధనఘోష్యమాణఘోణి
స్వర్ణతారాచలచ్ఛణకతండులరాశి బహుశాక తేమనభాజనంబు
దంతురతైలాజ్యదధినూతనఘటంబు వివిధాంశుమత్ఫలావీవధంబు
గుడశర్కరాపూర్ణ గోణీనికాయంబు స్వచ్ఛార్ద్రిఘోటగుళుచ్ఛకంబు
నగరిపుశిలావితర్దికాస్థగితహిమగు, మృగమదపటీరతరుఖండ మగణితోప
ఘాభరము లోనిచావడిదాఁటి నగరు, చిగురువిల్తుగురుఁడు ప్రవేశించె నపుడు. 6

ఉ. భానుఁడు గ్రుంకెఁ బ్రాచి హిమభానుఁడు దోఁచెఁ జకోరిచంద్రికా
పానము చేసెఁ జీఁకటులు వాసెఁ గుశేశయము ల్ముడింగె భృం
గీనికరంబు చెంగలువగీములు చేరె రథాంగముల్ వ్యథా
ధీనము లయ్యెఁ బాంథుఁడవిధిన్ విధిమాఱె రసాలవీథులన్. 7

క. ఆరాతిరి విడిదింగం, సారాతి రిరంసుహంసయానామాద్యా
న్నారీతిలకంబులతో, నారీతి సమస్తభోజనానందితుఁడై. 8

ఉ. అచ్చటఁ బచ్చటాకునిలయంబున గొజ్జఁగి సెజ్జఁ గాఁగిటం
గ్రుచ్చిన మచ్చెకంటి విరిక్రొమ్ముడి వ్రాలుతమింపలాడగా
నిచ్చినచేయి గుబ్బకొకయింత మరల్చి రదచ్ఛదంబు వి
వ్వచ్చునినేస్తకాఁ డరిదివాఁచవి మాచుచుఁ గూర్కె నత్తఱిన్. 9

క. క్రుంకె నెల మరుఁడు వేఁటకుఁ, గొంకె నుడూచ్ఛయము డొంకెఁ గుముదంబులడా
లింకెఁ దిమిరోత్కరంబు త, లంకె రవిచ్ఛవియుఁ దివిఁ దొలంకెఁ గడంకన్. 10

క. ఆమీఁద మధూళీధుని, దామీఁద మధువ్రతములు దర్పకదర్పం
బామని వచ్చెంబికముల, యామని మెచ్చెన్ గృశంబు యామినిగాఁగన్. 11

ఉ. మావులు పూఁచె మించెఁ గుసుమంబులు గొజ్జఁగి గుజ్జుపొన్నలున్
దావులు చల్లె మల్లెవిరి దార్కొనియెన్ గనియె న్ప్రసూనముల్
గ్రోవులు పూవులుంచె నిగఁగుందము లంపము మాపెఁ దేనెలన్
మోవులు రావిలోఁద్దుగులు ముందుగఁ గెంపలి రొండె నామనిన్. 12

రగడ. అవ్వసంత మఖిలాశాంతములం, గ్రొవ్వించె స్మరగురుదకుంతములన్

జగ్రొవ్విరి వాసంతిక ముడిచెన్, జగమివ్వలను హసంతిక విడిచెన్
జాజులు లేఁటుల జాపల వీఁగెన్, జాజరపాటలజాగులు రేఁగెన్
మావు లంగజుని మావులఁ దేల్చెన్, తావులీరములు తావులఁ బోల్చెన్
తొలఁకుసరళికవచులె పికగళము, ల్వాలరాహత్తికి వదలె నిగళము
ల్కాకము కోకిలఁ గపెలకుఁ దన్నెం, గోకవిరోధికిఁ గూరిచె వన్నెం
బచ్చవింటిదొర పాళెము వెపలె, న్వెచ్చనూర్చి కదు విరహిణి బపలెన్
అబ్బెఁ బ్రియులచే నతినలబారుం, గుబ్బచన్నులకుఁ గుంకుమనీరు
న్మంచు ముంచుకొన మావులు స్రుక్కెన్, స్మంచినీళ్ళుచి మహీవహికెక్కె
న్వాలిచలువలు చనువలునలు చొచ్చెం, జలిపచ్చడములు చలిపొరవెచ్చె
న్మొల్ల కొదిగెఁ దుదిముదుఁగుంగోకల్, సాలిఁ డారసెను సన్నపుఁ బేక
ల్వవెలుఁగుపస వీడె జనాళి, స్రేవెలుంగు పటురే నునుహోళిం
బండె నధ్వగుఁడు బహుపాచ్ఛాయ, న్నిండెను నలి నలినీతతి చాయన్
దిన మంతంతకు దీర్ఘత మనియెన్, అని చింతను నిశిహ్రస్వముఁ గనియెన్
మలయమారుతము మన్ననఁ గాంచెన్, మలయజతపములు మఱిఫలియించెం
దాలవృంత మసతారము దాల్చెం, బాలమొదలుగా ఫలములు రాల్చె
న్గోడిసె తింత్రిణీకులము విదిర్చె, న్వడపింది జనావళిపడఁ దీర్చెన్
ఇడుమ లొందె నూళ్ళద్దడివారె,
చిలుప జెలలనది జలములు మొలిచెన్, ఎలమావికి శుకియించుక వలచెన్
ధాత్రి ధాన్యముల ధారణ నెక్కెం, జిత్రకారకుఁడు చిందులు ద్రొక్కెన్
ఎత్తె హాలికుం డేతపుఁబాట, స్మత్తిలె దిటవతి మడుగులనీటన్.

క. ఆసమయమున మురాసుర, శాసనుఁడు ప్రభాతనిత్యసత్కృత్యముల
న్వాసిలి సత్యాముఖబహు, కేసరిమధ్యావినోదకేళీరతుఁడై.

ఉ. ఒక్కతెగుబ్బచన్నులకు నొక్కతెవాతెర కొక్కకల్కను
న్బెక్కలి కొక్క యంగనకనుంగవ కొక్కపాలంతిచొక్కపుం
జెక్కుల కొక్కతేమ ముఖశీమకుఁ జొక్కి పసిండిరెంటెపుం
జక్కనితండ్రి చక్రిమణిసౌధమునం గొలువున్న యత్తఱిన్.

ఉ. చూళికయందుఁ జెందునవనూనరజంబు కుజంబుశాఖికా
పాళిక దూఱఁ జీరు నిజబాహులరేఖలు మేననంటుమా
ధూళికబిందువుల్ దొరయఁ దోఁటయొకించుక సేయుపృథ్వగా

ద్రాక్షామాళి యొక్కఁగుఁడు తామరసోదరుఁ జేరి మ్రొక్కె దాన్. 16

క. సూనత్సౌద్రేక్షుద్రా, క్షానానాబదరలికుచ జంబీరం
భానారికేళిఫలములు, గానుకగాఁ బెట్టి తోఁటఁ గనుఁగొనుఁ డనిన్. 17

క. ఆకంసవైరి సత్యా, లోకస్తనివాంచ యెఱిఁగి కొంత నగరిలో
రాకకుఁ దోఁటకుఁ జేసి, వాకిలిఁ దెఱపించి కేలివని సమ్ముఖుఁడై. 18

సీ. తలపుగాఁ బూచిన తంగేడ్లవరుసక్కెఁ దాఁగున్న తాపింఛతరు వనంగఁ
దరుణవిద్రుమలతాతతులతో జోకైన పాకభిన్నలతాలోక యనఁగ
నందంపుటాఁ బెయ్యమందలోపలఁ జొచ్చి క్రీడించు కఱివన్నెకోడె యనఁగ
నద్దంపుటంచుమిన్నయకన్నియలలోనఁ బలుకొన్న మత్తకాదంబ మనఁగఁ
గొమరుప్రాయపు తోయంపు గొల్లపల్లె, వాధరలలోన మేల్తరమైనయువతి
బృందము పిలువంగ ముందఱ నంద నంద, సూనుఁ డారామవనసీమఁ జొచ్చె నపుడు.

మ. గనిమల్ దీర్చి కాల్వ తేర్పఱచి చెంగల్వల్ సల్పావినీ
రుచ క్షేత్రం బిడి వట్టివేఱు కురువేఱుం బోదికై మంచుచిం
క్కనిద్రాబోనగూడవాటుకొని గన్నేరావలంబైగు చే
సిన భద్రాక్షులు ద్రాక్షలిక్షువులు రాజీవాక్షుఁ డీక్షింపఁగన్. 20

సీ. మారేడుకడనున్న నేరేడుతోఁ గూడి జీడి పోయిన యోఁడె చెట్టుగట్టెఁ
దీరంటఁ బెరిఁగిన గోరంటతో మొన్న చిఱుదివ్వెలకె మావిచిగురు లొత్తెఁ
బూపొన్న సురపొన్న యీపొన్న పరిగన్న పున్నమతో లునాఁడె పూవు మొనపె
గొజ్జంగి యిజ్జాజి సజ్జంగి సల మొండు నెలకె కస్తురియుఁ గన్నెరయుఁ బూచెఁ
దొగరుటిగురుల థరగట్టుతో పురూపు, తోఁపుఁ గనుమని చే జూపు తోఁటపాటు
మోపుగొని రూపుచేసిన ముసలికాపు, మొసలిపోగులయొసపరి కెసఁగ నపుడు. 21

ఉ. అమ్మ పరాకు రాకు చిగురాకుజిగీకటిమేనిపాదుశా
కమ్మరుమీఁ పిరంగి గడుగం గడుఁ గ్రమ్మిన సీటిజీరుకుం
దమ్మికొలంకు సుంకు విడఁ దన్నిన పొన్నలగున్నలం దుమూ
రమ్ములు లేఁచె నో చెలి! కురంటక మంచుఁ జిగంటి తెల్పఁగన్. 22

సీ. కురుమావి పాదయొండె గరుకందుకందునో మొగ్గమంచు నరిగెల మగువలంట
గనిమ లించుక దాఁటఁ గానిల్కునో యించుఁ గదంపఁ జెలులంపఁ గాంచితిరుగఁ
బుష్పాళి కోప్పలు గుప్పింప మైచెమర్చునో యంచుఁ బాదపసుదతుల్లాదవఁ
బొదఁదూఱ యోర గ్రోవ్వద యింత చెనరునో యనుచు సైరంధ్రులు వెనుకొనంగఁ

గుంచె కాళాంజి యడపంబు గొన్నయున్న, రామలుడిగంబు చలుప నారామసీమఁ
బ్రేమవిహరించె నవహేమధామగర్వ, ధూర్వహానధామ సత్యావధూలలామ. 23

క. చళిసగకురవకనకులము, కుళకుళకోపరిపరీత ఘుమఘుమితపరీ
మళలహరీబహుళవిహరణ, మలయమహీనిలయమహిత మారుత మొలయన్. 24

మ. తపనీయాంతపనీపతత్పరిమళోద్యత్పుష్పమాధ్వీకపా
ళిపరాగాళిపరాగరాగభవమల్లీవల్లికాజాతశీ
తపంగాశీతరులాశదిగ్గజని కాంతగ్రావకోటీకుటీ
విపులాంతర్విపినాంతరంబు లలినీవేణుల్విలోకించుచున్. 25

సీ. ఒకచెట్టుచాలుఁబో యగ్రాంశు పేరెంప సుడినట్ట లేగాడ్పునిసుము కొనఁగ
నొకతేనె చాలుఁబో మకరాంకహాలహాలాహలయుక్తగళతిక్తతలు దరల్ప
నొకపూవు చాలుఁబో యుదధినందనచందనప్రసూనము పైమనంబు మాన్ప
నొకచల్వ చాలుఁబో యుడుపరిస్పృష్టగాఢరవియోగ తనుతాపరౌద్ర మడఁప
మమ్మ యని మావికడఁ బ్రాలి మధుపగ్రోలి, ననకబరిఁ జెక్కి పావలసీతుపకుఁ జొక్కి
మొక్కి చక్రస్తనీమణుల్ నిక్కి గోస్త్రనీఫలము మెక్కి యామెక్కి నెఱసిరచట.

చ. పరువులు వెట్టుచుం జిలుకఁ బట్టుచుఁ బుప్పొడితిన్నెఁ దొట్టుచుం
దరువులు చుట్టుచుం బుజముతట్టుచుఁ బూఁబొదరిండ్లఁ దెట్టుచుం
దరువులు ముట్టుచుం న్విరులుపందెలు గట్టుచుఁ గేలినొట్టుచుం
దెరువులు మెట్టుచున్ననలఁ దేనియ యొట్టుచుఁ గూర్మిఁ దిట్టుచున్. 27

చ. పొగడలు దూసి పుట్టికలఁ బోసి రసాలయ సద్రసాలపుం
జిగురులు డాసి చీరికలు చేసి విభాసిలు బొండుమల్లియ
ల్మొగడలు కోసి పావడలుమూసి విరాజిలకన్నె జాజితీ
వగములఁబాసి పూఁబొదలు వాసి పెనంగిరి మత్తకాశినుల్. 28

సీ. పన్నీటికాలువ పంతంబునకు దాఁటి జడఁద్రొక్కి వెనుకకు జాఱె నొకతె
పూఁదేనిదొన దాఁటఁ బోరలి యొద్దురలిన నివ్వలి కింత లాగ్గె నొకతె
బావిదాఁటెదనంచుఁ బరతెంచి లిన దప్పి జడిసి పైతరుశాఖ కొడిసె నొకతె
పదరి పందెమువైచి పొదదాఁట నెగయుచో వేణిచుట్టి నఁ గొమ్మ వ్రేలె నొకతె
తరుణసహకారశిఖఁ బిట్టు దన్నె నొకతె, లీల విటపంబుపైఁ జొకళించె నొకతె
మ్రొక్కి చివచివ పోఁకబ్రమానెక్కి నిక్కి, కొంతపిన్నం మింపుగాఁ గోనియె నొకతె.

చ. మన మొకమాటె యెల్ల యొలమావుగనీడలఁ బన్వళింపుమా

చనిచని యొక్కమారి కెలచల్లని మావులనీరు ద్రావమా
నన లాకసారి యన్నియు ఘనఘ్నవేణి కలంకరింపమా
యనియన మానసం బెసఁగ నవ్విరితోఁట వెలంది మందికిన్. 30

క. అయ్యాళికాపుతొయ్యలు, లుయ్యాలలం దూఁగఁ గుచభరోద్ధతి రాలెం
బయ్యెదలో ముక్తావళు, లాయ్యాయలయడుగు లూడ్చె నుడుగణ మనఁగన్. 31

క. మిన్నంటఁ బదములుందల, యన్నుయ్యలమీఁద నుండి యటు నిటుఁ దూఁగన్
వెన్నునిపాదము మదమునఁ, దన్నినదోసంబు దొలఁగఁ దలమోచె నసన్. 32

చ. తిలకముసొంపు మించెననఁ దీర్చితి నేర్చినమాత్రయంచుఁ దాఁ
బలికె నొకర్తు రంగలరెఁ బాపట నాకొనగోట నే సుమీ
యలవడుటంచు నాడె నొకయంగన పాటలరీతి మేలనన్
బెళుకుఁ బాడనేరనని బిత్తరి యోర్తు తరుస్తుతస్థలిన్. 33

సీ. హిమగంధసంధాయి సుమనోముహుర్ముహుఃపతనలతాగృహాభ్యంతరములు
కదళీదళపుటీవిగళద్బ్రామమకరందశీతలభూమిభూమీతలములు
నాళాగ్రధారాపునఃపునరుత్పతజ్జంబీరజలసూత్రసౌధశిఖలు
వరహరిచ్ఛదావరణలామజ్జకోజ్జ్వల కాయమానైక సైకతములు
మధుకరీగీరమాధవీ మంటపములు, మదనబిరుదకథాసుధామత్తశుకని
నాదభేదప్రసన్న పున్నాగవాటు, లాటపట్టయ్యె గోపికాకోటులకును. 34

ఉ. క్రోవిఁ గవుంగిటం బొదివి గోఁగును నూరిచి మాటలాడియు
న్మావినిముట్టి వంజులము మట్టి తుదిందిలకంబుఁ జూచియు
న్నావిలి నూర్చియుం బొగడ వారుణిగ్రాసియుఁ బ్రేంకనమ్ముఁ దా
మావలఁబాడి పొన్ననగి యాస్యము సంపఁగి కింత యెత్తియున్. 35

సీ. చూడక యీలేదు సూనంబు తిలకంబు ననమాటరాక కొమ్మనదు గోఁగు
ముట్టికొనక మావి ముకుళంబు చూపదు నగక కూర్పదు పొన్న నవ్యకుసుమ
పాఁజేరుపడక నింపదు ప్రేంకనము విరు ల్పొగడ పైనుమియక పూవు గనదు
మొగ్గ సంపఁగి పైకి మోమెత్త కీనదు కంకేళి తన్నక కళికలీనదు
క్రోవి గౌఁగిటఁ జేర్పక కుసుమమొసఁగ, దలరు నిట్టూర్పువిడక వావిలియుఁ గురియ
దౌర యొకదారి నివి తెగుదారు లనుచుఁ, గిసలయోష్ఠులు ప్రసవము ల్గొసరి కొసరి.

క. నాళీకాళీఘూళిమ, ధూళీఘునిధోరణీమధువ్రతమాళీ
తాళీపగనప్పాళీ, పాలితకంకేళికేళి భళిభళి యనుచున్. 37

చ. చిలుకలలోనఁ జిల్కలయి చెల్వఁపుఁబొన్నలలోనఁ బొన్నలై
యలరులలోనఁ దామలరులై నునుదీవలలోనఁ దీవలై
తలిరులలోనఁ గెందలిరుతండములై మృదువాణులగ్ర్యసా
భులు దరహాస లుజ్జ్వలవవు ల్మధురాధర లాటలాడుచున్.

శా. రావే శారిశిరోమణీ హరిమనోరాజీవసంజీవనీ
గోవిందప్రియభాషిణీ విధునిధీకుబ్జావిటప్రేయసీ
యోవిష్ణూత్సవదాయినీ మధురిపుప్రోత్సాహినీ యంచు న
ప్పూవుందోఁట మురారివారిజముఖుల్ పుష్పగ్రహవ్యగ్రలై.

శా. కొమ్మా పొదిరికొమ్మ కమ్మవిరిఁ గైకొమ్మా చలమ్మేల దా
నిమ్మా నిమ్మలనీడ నిమ్మగువ దానిమ్మాసఁ జేరంగ దా
తెమ్మా తేనియ తెమ్మ యిందుఁ దెలిముత్తెమ్మా ప్రసూనమ్ము భా
రమ్మా ప్రాణభరమ్ము నందగు సమీరమ్మానరమ్మా చెలుల్.

సీ. నాచెంగలువమల్లె నాఁచెంగదా మల్లునా చెంగటికి నంగనాచి పగిది
నీరేల పూఁగొమ్మ యీరేలయని కొమ్మ యీరేలపాటల కెత్తి నెలుఁగు
లేమల్లియలచాలు లేమల్లినదిచాలు లేమల్లిమచవాటి గోము కనుము
విరవాదిపొడమాడ విరవాదికొనునాడ విరవాదికలితమై వేడ్కఁపూది
విరులకేటికిఁ జేరెద విరులతరుల, కిసలములకేలయింత కేకిసల మసలఁ
బొగడదండజయాన యీపొగడదండ, దవనమవనంబు సవరింప దవనతాంగి.

క. కలికికడ నుండకయ చా, యలనొరసిన పుష్పితప్రియాళి ముసరసన్
దలఁకొందక వలమందక, తలకొన్నజయాప్తిఁ గన్నతపసిం గంటే.

క. మల్లియు నొకవల్లియుఁ దుద, బల్లిదముగ నల్లి సిగలు పట్టుకొనుచు నం
దెల్ల మగతేఁటులుండఁగ, నల్లవదత్కిరి దిట్టులాటలు దెలిపెన్.

క. జోరా వాసన యని యదు, శారదములమొంద దెంతచల్లనిపలుకు
ల్పేరుకొని కాపువాఁగ దేదు, నారదపటమంతు నేమి నాళీకముఖీ.

ఉ. క్రొత్తలిరాకు జొంపము ముకుందుఁడురాఁ డిటఁగోయఁబోయెడిన్
గత్తులబోసు గాడె కలికాకులకుంజమటంచు రక్తి సం
పత్తిఁ బెనంగెడి న్వ్యసులపాఁతఱ గాదటె పూమసంపెగన్
జిత్తము చేర్చి నిచ్చలువ చిచ్చులకోలగదమ్మ కొమ్మకున్.

సీ. సిగవిరులు నాతిచేతికిఁ దగులకుండ, నిక్కితివిగాని సంధిచిక్కినన్న

రంభ యధరఫలం బానిప్రక్కలించె, దేవవల్లభ కనవైతి ద్విజకులంబు. 46

సీ. కలరవారవ మింపు గులికెఁగా రంభాపరీరంభగతజంభహారిమదికి
మధుకరీగానంబు మాధుర్యమొసఁగెఁగా మానవీపురుషోత్తమప్రకృతికి
సంపంగితావిపాసంగెఁగా శారదాన్వితధాత్రీప్సితవిభవమునకుఁ
బొగడపుష్పాడి గంపవుడియొప్ప గుప్పెఁగా హైమవతీతబాణాప్తధరకు
ననుచు ననుచువచోయుచు ల్గనుచుఁ బ్రచుర, లకుచ విచికిలచంపకవికసనిచుల
చూతపరిఫుల్లభల్లాతకీశమాల, తరులఁ దరుణులు విడిపడి విరులు చిదిమి. 47

లయగ్రాహి.

కుందములఁద్రుంచి యరవిందములు గాంచి మకరందములు నించి నిజతుందములకున్ స్కం
కందములు చేరి చిగురందములు దూటి మధుబృందములఁగోరి తమిడెందముల నాదా
నందములఁ ద్రావి విరిగందములఁ దేలిన మిలిందములఁద్రోలి రోకచందమున వేణిం
గందములు మీటి కనిచిందముల నేటి కని కుందములఁ జాటిన ముకుందముకు రాస్యల్.

ఉ. త్రుంచిన మోసులు న్విరిచి త్రోచినకొమ్మలు చించినాకులుం
దించినకాయలు న్నగము ద్రెంచిన తీఁగలు రాల్చుపూవులు
న్వంచిన లేఁత్రమాకు లయి వాటపుఁ దోఁట కపివ్రజంబు సం
ధించిన నాఁటియమ్మధువనిం దలపించె వెలందిరాయిడిన్. 49

మహాస్రగ్ధర. మధురానాథు న్వధూటీమధుమధుమథను న్మాధవుం గూడి యంత
న్మధుపాళీమాధుపాళీమధురనినదము న్మాధవీసౌధవీథీ
విధురంభాస్తంభశుంభద్వివిధవిహృతులన్వేటివీటిప్రకాసా
రధరల్బింబాధరల్చేరఁగఁ జనిరి మహాస్రగ్ధరల్ ముగ్ధగాత్రల్. 50

చ. తటములఁ జుట్టుకొన్న బిగిదన్నిన క్రొన్ననపొన్న గున్న లం
జిటపాటమంచు మరచుజడి చిల్కాడి గొజ్జఁగికి ద్రసాలపుం
జిటివాటితె నెవానలకుఁ జేసిన కాల్వల తేటనీటి ప
ల్లటముల నిక్కనక్కలఁకులచ్చికి మెచ్చిరి వచ్చి నెచ్చెలుల్. 51

ఉ. గాత్రము మోయలేని యుదకంబుల కోర్వక పద్మమబ్బునాఁ
జైత్రుని పూవుఁదేనె కణజంబన శీతఘృణిస్ఫురన్మణీ
ధాత్రిజనించు దైవతపథప్రతిబింబ మనంగ వచ్చులో
కత్రయభర్త [illegible] క్రీడ జయు కాణ మనంగొల నొప్పె నెంతయున్. 52

కలకలహాసహంసజనిజ; కలకలహంసీరథాంగకలకలకుల [illegible]

మలమలయనిలయమధురా, నిలనిలయము కొలనువలను నెలఁతలకొసఁగన్. 53

క. అట్టియెడ నైందవోపల, పట్టికలం గట్టినట్టి పలుమెట్టికల
నెట్టిడిగి కొలను జొచ్చిరి, చెట్టాపట్టాలు వట్టి శీతాంశుముఖుల్. 54

లయవిభాతి.

మిసమిసని చన్నుఁగవ పసలు గని జక్కవలు బిసబిస బిసప్రసవవసతి డిగి పాఱన్
నొసలిపయి ముంగురుల యొసపరితనంబునకు భసలవిసరంబులును దెసలఁ బరువెత్తన్
గుసుమవిశిఖాస్త్రములఁ గుసులకు నడంచు కనుమిసిమి సిరి బెడిసల నిసువులనదల్పన్
గిసలయవిభాతిరుచి లసితపదము ల్కనుతి కసరి విసర స్సరసి మసలిరి కృశాంగుల్.

క. అల్లేమ చనుహాళీహాళి, వల్లనె కాదల్ల వళివివాదావళి రా
నల్ల వళావళిగల యా, కల్లోలము లెసఁగ హల్లకల్లోలముగన్. 56

క. గుభులు గుభుల్లని దుమికిన, రభసంబున నెగయు నీరు రాజీవముచే
నభమిభవరదుని పదమని, యిభగామిని యొకతె గడిగియిడియెం బూజల్. 57

క. దరిమెట్టి జిరుకుఁ జట్టులఁ, జరణంబులఁ జక్కఁజాచి జాఱిరి చామల్
సరియే మా పదముల కని, యరుణాబ్జము శిరము ద్రొక్క నరిగినకరణిన్. 58

చ. కొలఁకు కెలంకుఁ జేరి మఱికొందఱు జీరుకుఁ జల్వరాచరా
పలకలవెంట జాఱి మొలబంటి జలంబుల నిల్చిరంతు లిం
పుల హరిద్రక్స్రంపరల ముంచినయాత్మగభీరభవ్యనా
భులకు సరోవరంబు సరిపోదని లోఁ తెఱిఁగించు కైవడిన్. 59

సీ. ఒకచక్కి నోలకు లిడుచకుచాకచోచ్ఛ్రయ మింతయొడిసి కేశవుఁడవైతి
వనితచే కొలఁది వైవఁగఁ దుందుమంటిన తమ్మిచేఁ బంకజోదరుఁడవైతి
తనజోడు మత్స్యయోద్ధరమంచుఁ గోకంబు వడఁబట్టుకొని చక్రపాణివైతి
పూఁదేనె యరవింపపుటిఁ జెంద సఖి కేలనుం బట్టి మధుమథనుండవైతి
కమ్మతామరపుప్పొడు ల్కంబుకంఠు, లొండొరులు చల్లఁ బీతాంబరుండవైతి
నేఁడు నిజమంచు నగఁ జొచ్చె నీటిలోన, మగని గుణపేటి సత్యభామావధూటి. 60

సీ. మీఁదఁ జల్లకమాన మిట్టిమీనై పడ్డ మంతునింతకు మోము ముసుచుకొనినఁ
గూడనిత్తునె మాఱుకొని మొఱయెత్తినఁ గరిమెన నోరింతకంటెఁ జేయ
నేఁజిక్కువడుదునే యొటకుఁ జేచాచినఁ బంతమిత్తునె యెంతభంగపడిన
డీకొందునొంత నీటికి నడ్డగట్టినఁ బాఱఁబట్టుము నెంతబలిమిఁగన్న
ననియె సాత్రాజితీదేవి తనదు ప్రియునం, ఖేలఖామునఁ గాసారకేళిఁ బట్టి

కేలిగురువట్టి నను దేవుమేలిపట్టి, పీలినెట్టెంపు జగజెట్టి గేలిగొట్టి. 61

సీ. నునుకురుల్ శైవాలమనుచు లాగితిఁగాని కుటిలత్వమెఱుఁగనే కుముదగంధి
మించుగుబ్బరథాంగమంచు మీటితిఁగాని కాఠిన్యమెఱుఁగనే కంబుకంఠి
హాస మంభోరుహంబంచు గిల్లితిఁగాని యతిరాగ మెఱుఁగనే హంసయాన
గట్టివాలుఁగ వాలుగనుచు ముట్టితిఁగాని చపలత్వమెఱుఁగనే సైకతకటి
భంగముఁ దలంపవలదు తరంగవళిక, వలదు వడిసుళ్ళమాట లావర్తనాభి
యేల యిటులాడ నాళమృణాలబాహ, యనిరి భృంగావలోక లయ్యంబుకేళి. 62

చ. కలకలగొగ్గుతోయముల గగ్గులకాడగు హంసచక్రము
లెక్కలఁకులఁజేరు శైవలము క్రేవల వెల్వడు కల్వతూఁకులం
దెలివిదొలంగు తామరలతెట్టువగట్టిన తమ్మిపుప్పొడు
ల్గలిగికొలంకు వోలెఁ గలకంఠులచే గిరిఘూర్ణితాంబుధిన్. 63

క. ఉదకవినోదక్రీడం, జెదరినసారంగమదముచేఁ జేతిశత
చ్ఛదమున మైపుప్పొడితో, యదుకులకుంజరము సరసిదై వడివడలెన్. 64

సీ. చేయీఁత చాలింపఁ జెల్లుఁబో చల్లగాడ్పులదిట్ట దతీ మెట్టనీదుగాని
యోలవీడఁగనాడు టొప్పుఁబో హిమగంధపాథోధరం బొడఁబడదుగాని
తగిలిపట్టుట మానఁదగవెపో మరుతేఁటితెగ పాటవగసమ్మతిలదుగాని
మునిఁగి తేలుట డించఁదనరుఁబో రాయంచకోడె నెన్నడ యీయకొనదుగాని
యనుచు నొకభంగి కాసార మపుడు వెడలి, రొడలిబడలిక కైటభద్విడలికచలు
కదలుదురె నాఁటికెగ్గడికత్తె కేలి, చికిలిబెత్తంబుతరు లింతచేసెఁగాక. 65

క. చాలించి కేళి షాన్నన, చాలించిన వలువఁ గట్టి చామీకరవ
చ్చేలాధరజితమణులకు, చేలాధరహావభావహేలాధరలై. 66

సీ. ఒడ్డాణ మిదినాది యొడ్డార మేటికే యొడ్డా యయో దీని కువిద నీకుఁ
గట్టాణిసరి యీక కట్టాచెలియతలకట్టాయె జగజెంతకట్టడములకుఁ
గడియాలడంచుట కడియాలములకె యొక్కడియాలమున్నె నీగబ్బితోడ
ముంగైమురారి నాముంగైని నిడుమన్న ముంగైపలుకవే కురంగనయన
పేరు జెమ్మన దూరెదు పేరుగుచ్చి, తాళియడిగినఁ గసరెదు తాళికొనక
యనుచుఁ గైసేసి మత్తకాశినులు డాసి, రాళిఁ గోసిపలాశిభిదాసితాళి. 67

ఉ. గచ్చుటరంగులం ఖసిఁడికంబముల న్వెలయెచ్చు పచ్చరా
లిచ్చిన డాపలం బనిరహిన్ రహిదచ్చిన కొల్చుకెంపుమే

ల్మచ్చుల ఖేచరీచతురలాస్య విచిత్రచరిత్ర చిత్రచే
తోచ్చయ రుక్చకచ్చకల నుచ్చైముద్రోచిన మేహ చెంగటన్. 68

క. వనితలతోఁ గాసారా, వనితలతోయజసమగ్రవాసన సన్త్రో
వన భోజనందనాపతి, వనభోజన మొకరసాలవాటిం జేసెన్. 69

సీ. రంభాదళంపుటోరల నుప్పుపాదులపై సాహకారశలాటుసమితి వడియెఁ
గపల వడ్డన లిడ్డ కమ్మని వడలపైఁ దరుబృందమకరంద ధారకురిసెఁ
జేకొలందిగవంచు చీనిచక్కెరలపై నంశుమత్ఫలచయం బవిసిరాలె
నతిశీతలతఁగన్న హంసోదకంబుపైఁ బాటలీపటసూన పటలిరాలె
సిగలపై శారదరజలంబు చిందెవల్లి, తనులపైఁ బర్ణతాలవృంతములు దిరిగె
సంతతాయత్నకృతవస్తు శాఖ్య మొసఁగె, నేజనం బెంచ దీవనభోజనంబు? 70

శా. ఆకమ్రాసవతామ్రపల్లవ నవామ్రావాసభూభోజనం
బాకూలంకషదీర్ఘికాసురభి కల్హారాంబుసంసేవనం
బాకర్పూరకదల్యుదారమృదువాత్యానతఁ నాత్యాదరం
బాకౌంతేయసహాయకామినుల కాహాహాయొనర్పింపదే. 71

క. జాంబూనదపుంబూనిక, డంబూరు మణుంగు పచ్చసంబూని కటిం
బింబోకకదంబోజ్జ్వల, బింబోష్ఠీకుముదినీందు బింబోదయుఁడై. 72

శా. వీణావాద్యము గద్యపద్యకవితా విద్యావినోదంబు క
ల్యాణీకన్నడపారసీముఖ ముఖాలాపంబు లానద్ధక
ల్యాణీభూత విచిత్రలాస్యము ప్రశస్యాంభోరుహాస్యామణుల్
ప్రాణంజూప మురాపహారి హరి యుద్యానోర్విపసం డెందగన్. 73

వ. అనిన విని మురాసురారాతితరుహాతివృత్తాంతం బెట్టిఁగింపుమని యడుగుటయు. 74

గా. భాషావాక్యవిశేష శేష భువనప్రచ్ఛాదిఘోటచ్ఛటా
హేషాహస్తికఘోష ఘోషమహితాహృద్వల్లభప్రాపితా
శేషారిక్షితియోగ ఘోమధిపతిశ్రీపూతిఁ కీర్తిప్రభా
తోషాపూరితదిక్పకోరచయ పాథోధిశ ధీమన్ముఖా! 75

సుగంధి. కటకఢిల్లిపురమల్లికాలిజాగరాముదా
కటకమాహుతీశిరోజఘటకలంబ మందువా
ఘటచకోరలోచనా కుచద్వయీలసత్తటో
త్కటపటీరశాద సద్మశోభనదిశావిశదళశా. 76

క. కదనత్రినేత్ర వాణీ, మదిరాక్షీ నటనరంగమందిరవదనా
మదనాగ కామినీజన, మదనా మదనాగతురగ మానితసదనా! 77




ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్రకరుణానుగ్రహాశాశ్వతైశ్వర్య ధుర్యతామహేశ్వర రూ
పరేఖావిజితరతీశ్వర సరససంగీతసాహిత్యసకలకలావిచక్షణ సమాశ్రితవిద్వత్క
విరక్షణదక్షవీక్షణ యినిగాలగోత్రపావన పరిపంథిరాజకల్పితపాదసేవన
దామరల వేంకటాధీశపుత్ర చెన్నభూపాలకకలిసౌభ్రాత్రగురువమాం
బాగర్భశుక్తిముక్తాఫల గురువనజసంభవభవశేషభాషామనీషాబల
ప్రతిదినాగతార్థిజనవరప్రదాయక వేంగళనాయకప్రణీతం
బైన బహులాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునం
ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# బహులాశ్వచరిత్రము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీతరుణీరమణ పదా, బ్జాతరుణీభూతహృదయ పరమదహృదయా
నీతసుధీవ్రాతదయా, యాతతవిభవేంద్ర వేంకటాధిపచంద్రా! 1

ఉ. అంతటగోపికాహిత హృదంబుజమాబహుళాశ్వమేదినీ
కాంతునిపై ఘటించి రతికాంతునితండ్రి నిజాంగనాగణం
బంతిపురంబు నన్నిలిపి యచ్చటసర్వబలంబు లప్పుర
ప్రాంతములందు డించి గమనాప్తికి సప్తినెదం దలంచినన్. 2

గీ. చట్టుపలఁ బుట్టులేఁగాడ్పుకొట్టునకును, జెట్టుకాయలు రాల్చినయట్టునిట్టు
తొట్టుతొట్టునఁ దారక ల్చిట్టుడుళ్ళఁ, బిట్టదొర శౌరికట్టుపకుట్టుపడియె. 3

గీ. ఉట్కిపడిమ్రొక్కు గతిఁదెల్పు నురగవైరి, వెన్న వెన్నఁ గొని విన్నువీథికెగసె
నగశిఖరులెల్ల సిగవట్టి దిగిచినట్లు, హల్లకల్లోలముగఁ బ్రాఁతు పెల్లగిల్ల. 4

గీ. ఎగసి మిథిలానగరిబాయ నిగిడి గరుడి, చక్కనడతెంచి జనమెక్కటిక్కత్రోవఁ
దనదుపైఁ జక్కగరుడకేతనము గదలఁ, గడలిపైఁ బొలు కప్పలికరణి నపుడు. 5

సీ. చుట్టువేడెము బట్టుచూపుచోఁ గడగట్టి ఘటకారచక్రసంగతి భ్రమింప
నడ్డవేడెంబింత యిడ్డవేలుపుఁ జెట్టు పన్నగగమనసంపదలఁ గదల
నట్టునిట్టు దువాళిహావణింప నాసులొక్రొచ్చినా వలిమెట్టు గునిసియాడ
జోడనల్ జూటించుచోఁ గవ్వపుంగొండ వెనువెంటఁ బుట్టుచెండనువు మొనప
నిడివినడతెంచుచోటను జడదపటలి, గాలిపటముల రహిఁ దెల్పగగనవీథిఁ
బులుఁగుబోల్లఁడు గాడ్పుచాడ్పునజగంబుఁ, జౌరఁజాలు గరున్మరుజ్జవము నెఱపె. 6

గీ. సింగాణికోలవారిన, రంగునఁ దనగరులు రింగురంగుల మొరయన్.
బంగరుచాయపతంగతు, రంగము హరిమోచి నిబ్బరంబునఁ బఱచెన్. 7

చ. పఱచి మురారిచేల నిజపక్షరుచిచ్ఛటలభ్రకోటికి
న్నెఱపులు గుమ్మరింతలయి మిన్నులగంటికి మచ్చగీఁతలై
చెఱకు వెలుంగురంగు జిగసోఁకనిచోటికి లేఁతయెండలై
కొఱనెలతాల్పుచుప్పటులకుం దొగరంచునులై రహింపఁగన్. 8

మ. కరిరాట్పట్టనహట్టనారుల నిరీక్షాతాళతళ్యద్యుతుల్
హరికన్గొంటివె మింటికెత్తినమొగం బమ్మక్క మ్రొక్కించె ము
క్కరచేర్చుక్కకుఁ జేరు చుక్కజడతోఁ గాల్ద్రొవ్వెడిం జిత్తభూ
తరహారిక్రియ ధాత్రికీలుజడయుం దర్పించి కోరాడెడిన్.

సీ. అదె భానుఁడు ప్రతీచినుదయించితమముచిక్కనఁదెచ్చెననుచుఁబల్కెడునయోధ్య
యదె తటిల్లతిక పూర్వాబ్ధిపానార్థమై యద్దంబుగొనివచ్చె ననియె మధుర
యదె హాటకవిమాన మెక్కించి కరి వజ్రికప్పతియంపినాఁ డనియె మాయ
యిదె హేమసుమరథం బెక్కి కంతుఁడు సుధాంశుని గూడుకొనివచ్చె ననియెఁ గాశి
వాసిగా నోషధీశైలవరము నుటికి, పెటికికొని తెచ్చుచో నింతపిటికిగాని
హరికిసరివచ్చునని యనినది యవంతి, నిన్ను మోచిన ననుజూచి నీరజాక్ష.

మ. అదె వాహ్యాళి బహిర్మహీమహితహర్మ్యస్వర్ణకుంభంబుపా
న్నదె ప్రాక్కచ్ఛపగామ్యగాధపరిఘాప్రాంచన్మణీవప్రము
ల్లదిగో ధూర్జటిధర్మధూర్వహనసమ్యక్ఛంద్రశాలాధ్వజం
బదె వైదేహవివాహగేహతిలకం బంచుం బ్రశంసించుచున్.

క. చేతోగతిచే భుజగా, రాతి వియత్పదవినుండివ్రాలె న్మిథిలా
భూతలమునవాతావాతి, చేతంబడు నాఁటిమేరుశృంగంబనఁగన్.

క. జననీదాస్యముఁద్రోచె, న్మనుపమ్మృతముఁ దెచ్చి పక్షిమూర్ధన్యుఁడు నేఁ
డును పేందామృతదాతృత, జనకునిదాస్యంబు నిలిపెజగమరుదనఁగన్.

మ. శతపత్రాక్షుఁడుప్రోలుచేరి బహులాశ్వప్రాంగణంబంటినన్
శ్రితదేవుండది వేఱచూచుబహులాశ్వుండోంచి మున్నున్న యీ
క్షితిదేవోత్తము నిల్లుసేరనృపుఁడుం జింతించునంచున్రమా
పతియందిర్వర కేకకాలమున రూపద్వంద్వముంచాల్చినన్.

క. శ్రితదేవునింటిముంగటి, కతిజవమునవ్రాలె నప్పు డంతకుమునుమ
న్నతగేంద్రుఁడిగ్గి డిగ్గన, శతపత్రాక్షుండు నృపుహజారము మ్రోలన్.

సీ. జానకీధవపదధ్యానప్రమోదాస్య కమనీయగండభాగములవాఁడు
రఘురామచరణస్మరణధీవికస్వరస్వచ్ఛరోమాంచ గుచ్ఛములవాఁడు
రామార్పితాన్నసత్ప్రహృష్టద్విజాశీరక్షతస్నాతశిరమువాఁడు
రఘుకులాధిపఘనాపఘనసాక్షాత్కారచిత్తాబ్దమననమస్కృతులవాఁడు
హృదయమృగమదరేఖామహీదుహితృ, ధీశసింహాసనత్కనద్దివ్యరత్న

నూత్నపదకంబువాఁడుభూసుతుఁడుజనకుఁ,డపుడుకొలువుండిహరిరాకహావణువినియె,

ఉ. అమ్మహిభర్త వించునె రయమ్మున లేచి భయమ్ముభక్తి డెం
దమ్మునఁ గప్పి ముప్పిరిగొనం గొనసాగిన యానధాటిహ
ర్మ్యమ్ములుదాఁటి రామజపమాలిక నేలిక నెన్నుకొంచు నె
త్తమ్మికటారిరాచదొరతండ్రిపదంబులవ్రాలె నయ్యెడన్.

క. కడలిదొరకూర్మియల్లుని, యడుగులఁబడి విడువఁజాల కన్నరపతియుం
దడిచెమట ముజ్జగంబులు, గడిగినపాదములు కడిగెఁ గన్నీటి జడిన్.

శా. లేవోయన్న సుభద్రయన్న పదనాళీకంబు భూమీధవుం
డేవేళన్ విడఁ డయ్యె నంపదరవిందామందమారంద హే
లావిస్రంభమిళిందడింభక మదల్పం బోనిచందంబునన్
భావత్పల్లవపాతి కోకిలము లేవం బోనిచందంబునన్.

చ. మురహరుఁడెత్తెఁ బాదముల మ్రొగ్గిన భూవిభునాల్గుచేతులం
బురహరుఁడాయుధం బిడినపోలిక ధాతసృజించెఁదత్పురీ
ధరజనకాకృతి న్నిలుప దన్ గని మ్రొక్కిన యాత్మభక్తికిన్
గరచరణాదులబ్బెనని కౌతుకచాతురినెత్తువైఖరిన్.

క. హరిలేవనెత్తి యుర్వ్వర, నుర మత్తిన యిసుముదుడిచి యుర్వీశు క
తరబాష్పధార తనబం, గరుదుప్పటి నొత్తి బత్తిగడలుకొల్పంగన్.

క. అప్పరమభక్తు వక్త్రమె, తప్పక కనునప్పుడెదను దాత్పర్యరసం
బుప్పతిలఁ బట్టుచాలమి, గుప్పునఁ గన్నీరు వచ్చెగోవిందునకున్.

శా. ఆకంసారికి డాకరం బొసఁగి జేరాడంగ బంగారపుం
గోకంచు ల్వ్రాలకేలఁబట్టి హరిఁ దోడ్కొంచు న్నిజాంతఃపుర
ప్రాకారంబులు దాఁటి హెగ్గడులు యోరంవెట్టి యట్టిట్టుపో
వాకిళ్లెల్లను దూఱి, చప్పరము లోవంజేరిరాజయ్యెడన్.

మ. మగరాటుంకు మిటారి పచ్చనవలా మంజిష్ఠి రెంటెంబుసో
యగపుం గల్మికిఁ గ్రొత్తలత్తుకల చాయల్ దిద్ద జాల్ నిద్దపుం
బగడంపుం బనికంబపుం బసలు కన్పట్టంగ బిట్టెత్తి క
ట్టుగజంబెన్నదికట్లు దిన్న తెర మీటుల్గల్గుసౌధంబునన్.

క. శయ్యాగారసమీప ని, కాయ్యాజిరరచితరత్నఖచితవితర్దిం
చెయ్యాడు రత్నకంబళి, నయ్యాదవసార్వభౌమునయ్యెడ నుంచెన్.

క. అందు గుణసింధు బంధులఁ, జందనగంధుల నిజాంబుజాతేక్షణలన్
నందప్రియనందనునకు, వందనమొనరింపఁజేసి వర్ణితభక్తిన్.

క. పన్నీటఁగడిగి పదములు, పొన్నలపొన్నలశౌరిపూజించుచుఁద
త్పన్నీరము నిజశిరముప, యున్నతి వహించి గృహమహిన్రహిఁ జిలికెన్.

క. అప్పుడు రుక్మినిమురహరుఁ డప్పనయిడఁ గూరుచుండి హరిహస్తాబ్జం
బప్పార్థివుఁ డొదలనిడి, చొప్పడ నేత్రములనొత్తుచున్ జేర్కొనుచున్.

సీ. గోరక్షణమునకై గోవర్ధనమహీధ్రి మెత్తిన నాఁడెంతయిల్కెనొక్కొ
కువలయాపీడంబు కొనగొమ్ము వట్టి పెకల్చిన నాఁడెంత కందెనొక్కొ
చాణూరమల్లవక్షఃకవాటతటంబు వొడిచిన నాఁడెంత యుడిసెనొక్కొ
యుగ్రసేనునిపట్టి నొడసి ముందలవట్టి తిగిచిన నాఁడెంత తెగియెనొక్కొ
కటకటా తమ్మితలిరులకంటె నున్న, నున్నయిక్కేలుగాసికెట్లోర్చెమిగుల
నొగిలె నోతండ్రియని తొంటి నొప్పిదీఱ, నట్టివలచేయి గట్టిగాఁ బట్టిపట్టి.

సీ. బండిరాకాసిరా దండిరాకాసించి పడఁదన్నుచో నొప్పి దొడరకున్నె
కాళియాహిస్ఫటాకాళియాహతిచోట నుత్తమాంగంబు రాలొత్తకున్నె
కడిమిచెట్టునకెక్కి కడిమిమైఁ గాళింది నడిమికి దుముకుచో నలఁగకున్నె
మగలరాయని తేరి నొగల నుండి ధరిత్రి వగుల గుప్పించుచో నొగులకున్నె
క్రొత్తనెత్తమ్మికంటెను మెత్తనైన, యిత్తరిలిరుటాకు టడుగంచు నీశ్వరాంఘ్రి
యెత్తి యెత్తి కనుంగవ నొత్తియొత్తి, బత్తివర్తిల్ల నారాచహత్తివలికె.

శా. పాతాళంబున నిల్లుగట్టి బలినీబంటొంటి మైనుండఁగా
భ్రాతంగాదని నీవ దిక్కని పదాబ్జం బౌదలం దాల్చి వి
ఖ్యాతిన్ లంకవిభీషణుండు కలుగంగా మాను లట్లుండఁగా
నాతండ్రీ ననుఁగోరి వచ్చితిటకున్ నాభాగ్యమేమెంచెదన్.

ఉ. కొండలఁగోనలం నిలిచి కూటికిఁగూరకుఁ వింత యింతలే
కెండకువానకుంజలికి నిచ్చఁ జలింపక రాఁతఁజేసి న
ట్లుండి నినుం దలంచు నరు నొక్కనిదాఁకి తలంచవీవు నా
యండకువచ్చి నావెతలనన్నియుఁ దీర్చితి నందనందనా.

క. భక్తులులేరో మారుత, భుక్తుల ముక్తులకుఁ బాలుపడు శమదమసం
భక్తులులేరో నీ పద, భక్తులు లేకున్న నాకు ఫలదుఁడవనుచున్.

క. అభివందన మానకదుం, దుభినందనమణికిఁ జేసి తోయదరేఖా.

నిభునిం దనపాలిటి శ్రీ, విభునిం దనరించె నతుల వివిధస్తుతులన్.

వ. అప్పుడు పరమానందరమాకందళిత హృదయారవిందుండై గోవిందుండు భూపురందరున కిట్లనియె.

మ. అలరుక్మాంగదశౌనకార్జునులఁ బ్రహ్లాదున్ శుకున్ వ్యాసభీ
ష్ములను న్నారదునిం బరాశరు వసిష్ఠుం బుండరీకాంబరీ
షుల నాదాల్భ్య విభీషణుంగనమొ యాసొంపు ల్విమర్శింపమో
యలఘుగ్రామణి నిన్నుఁ బోలఁగల దాసాగ్రేసరుం గంటిమే.

సీ. ఈయింతులకటాక్ష మిభరాజవరదపూజాంబుజంబున కభియాతిగాదె
యీజవ్వనులనవ్వు శ్రీజానిచరణపుష్పాఘ్రాణమునకుఁ బ్రత్యర్థిగాదె
యీకలికిగమి పల్కు కృష్ణకథాసుధామాధుర్యమునకుఁ విరోధిగాదె
యీచానగమిగాన మీశ్వరముఖకౌముదీధ్యానమునకు విద్వేషిగాదె
యిట్టిభోగమహాభాగ్యహేల నోల, లాడుచుండియు మామీఁది యాదరంబుఁ
దివియ వౌరౌర శుకవామదేవులకును, లేనిసుఖ మబ్బె నీకు భూజానిచంద్ర.

సీ. మదనాగగామినీ వదనాబ్జదర్శనోత్సవవేళ నానాభిఁ దలఁపఁగలఁడె
ముకురాననామణీచికురావలోకంబుతటి నానెమిలికుంచెఁ దలఁపఁగలఁడె
ఘనకచాకంఠజఘనదృష్టియెడల నాదరసుదర్శనములఁ దలఁపఁగలఁడె
వరకటీభూలతాధరవీక్షితముల నాధర్మకౌస్తుభములఁ దలఁపఁగలఁడె
యొకఁడు నినుబలెఁ దమిరెంటనొకటిగాఁగఁ, గవులుతలఁచిన తలఁపులుదవులుగాక
చింత యిటు చేయనేటికిఁ జెల్లెనయ్య, రాజఋషివయ్య బహుళాశ్వరాజవర్య!

క. అనిమెచ్చి పచ్చవిలుతుని, జనకుఁడు పడుకింటి పసిఁడిచప్పరమంచం
బునఁ బవ్వళించె బహుళా, శ్వనరేశ్వరుఁ డూడిగంపు చాతురిఁ జూపన్.

సీ. ఇతరాస్యవీటికాధృతహస్త మురవైరి విడెముఁగొమ్మని యొత్తు వేఁడుతెఱఁగు
తనువేఁడు చొకతె చన్మోన లంటి హరినొర్తు కొనకంటఁ గినుకంటఁ గనినచూడ్కి
కడలియల్లుఁడు పోఁకముడియూడిచిన నొక్కయన్ను కన్నులు మూసికొన్నసిగ్గు
పుంభావరతి జెల్వపొలఁతి నలసి తంచు బిసరుహాక్షుఁడు పిక్కపిసుకు సెవరు
వనరుహోదరుఁ డేగురంగనలకిచ్చు, క్రీడ నేర్పెచ్చు చిత్రచరిత్రపటము
లాగు గని చక్రి ధాత్రీకళత్రుఁ బొగడె, మామకధ్యాన మెందును మానఁడనుచు.

క. అపరాంబురాశి మునిగెం, దపనుఁడు దనకరములకును దగులక పంకా
ల్యుపధి న్వనధిం డాఁగిన, కపటాధము శైటవైవఁ గదలుట వోలెన్.

క. ఆదిసుమాంజలి యిచ్చి మ, హాదేవుఁడు తెరువు గట్టునటువలె నర్ఘ్యం
బాదుల నిడి భూసురుఁ డీ, యాదిత్యుఁడు బ్రష్టు మని రయంబునఁ దిరిగెన్.

మ. కకుబంతంబులు వేసిమ్రోసె సకలాకాశావకాశంబుల
న్నకునంబు ల్శకునంబు లయ్యెఁ గులటాచంద్రాస్య కబ్జంబు కో
రక మయ్యెం గర మయ్యెఁ గైరవము చక్రశ్రేణిగుండెల్వ కా
వక లయ్యె న్సెక లయ్యె పాంథజనతాస్వాంతంబు లంతంతకున్.

సీ. ఉండినట్లనె యుండి యువిద ముంగలలే దిదేమొకో యని చూచు నిరుగెలంకు
చూచి వెన్కకు వ్రాలి యీచెంత లేకున్కి గగనవారి ఖగాలి కెగసి వెదకు
వెదకి లోఁ వెతఁ గుందు వెతఁ గుంది యొం డొంటి కామెతపుల్గుల కలిగి పొగులు
పొగిలి యంబుజవనంబునకు గుప్పునఁ బడుఁ బడి తామరల మీఁదిప్రక్క లరయు
నరసి సరసీరుహాకరంబొరసివెడలు, బడలుఁ గడలు విలోకించు నొడలు మఱచుఁ
జఱచు నెఱకులఁ దఱుచు వాఁదెఱచునఱచుఁ, గోకిఁగానక యొకచక్రవాకమపుడు.

సీ. భానుశతాంగంబు పడినప్పు డెగసిన పాథోనిధానాబ్జపాంసు వనఁగ
నర్కుఁడాశరుచక్కి యంబరాంచలమునఁ దుడిచిన ఖల్లావుతోయ మనఁగ
వరుణారుణాధర లరుణాగ్రమునఁ ద్రిప్పి యటుఁ జల్లు నారాత్రికాన్న మనఁగ
వారుణాలయ భిత్తి వసి చిక్కు రవితేరి ప్రక్కచందురుకావి బొక్కమనఁగఁ
గదిసెఁ బాశాయుధాశావకాశమునఁగు, శేశయమణీశకలశైలజేశకేశ
పాశభరశాతకుంభ శుంభత్కుసుంభ, రాశినీకాశసంధ్యాప్రకాశపటలి.

సీ. హస్తమస్తవిపాతిహరిదశ్వరథచక్రనేమిఘాతోదితానిలసఖంబొ
అహరీశవిరహతాపహుతాశకృశపాశధరదిశాకిసలయ తలిర భరమొ
రజనీకరోదయప్రాక్పశ్చిమహరిన్నగూహానాగతకోకకోటిరుచియొ
నిటలాక్షునటనాది పటుపుష్పపుటదత్తకరవీరసుమనఃప్రకాండ చయమొ
సాశ్వకస్యందనదినేశ్వరావగాహ, గగనవీథీసముత్పతత్కంధిరాజ
సంజరంజత్ప్రవాళపుంజమొ యనంగ, సంజక్రొంజిగి మెఱసి కెంజాయ నెఱసె.

సీ. తనకు వన్నియఁ దెచ్చుతమి కగ్ని తెచ్చియర్పణము చేసిన తనపదవి యనఁగ
నెడమధుసేవకై యిడు రాత్రికి బలుండు గట్టించు తాఁగట్టుపుట్టు మనఁగ
నొకచోట నిల్వనీఁ డుగ్రాంశుఁ డని నిశాశరణమొందిననిజచ్ఛాయ యనఁగఁ
దనతండ్రిపాటుఁ గోరినసంజను జయించు రజనిఁ గూడిన యినాత్మజ యనంగ
నంధకధ్వంసి కంధరాకంధరాళి, సింధుబంధుస్తనంధయీ జీవితేశ

గంధసింధురపాణింధమాంధతమస, మల్లికకుబంతసంధి సంధిల్లె నప్పుడు,

ఉ. చెప్పకు దుప్పటీముసుఁగు చెయ్వులు గోడమఱుంగు లేటికిం
జొప్పడు శూన్యగేహములచో టదియేల నికుంజ మేల మా
కిప్పుడు శంభళీభవన మేటికిఁ బైరులయోర లేటి కం
చప్పుడు చిమ్మచీఁకటి బయళ్ల రమించిరి జారదంపతుల్.

మ. అకటా! యిక్కువ చెప్పిరాకునికి యేమంచుం దదీయాలయో
ర్వికి డాయుం దలవాఁకిట న్నిలక సారెం జేయు సంచారము
ల్సకిలించు న్ప్రకటించుఁ బాటఁ బరుఁ బిల్వంజూచు జారుండు బం
ధకి సంధింపమి కంధకారసమయాంతఃప్రాప్తి సంతప్తుఁడై.

చ. విటుఁడు బహుప్రకారముల వేఁడ నొడంబడి క్రీడఁ గోరి వాఁ
కిటికరుదెంచు మళ్ళిచను గేళిదెస న్భయసంభ్రమాప్తిమై
నటు నిటుఁ జూచుఁ జీమ చిటు కన్నఁ దలంకుచు వచ్చి జారకాఁ
గిట నవజారిణీమణి సుఖించు మృషాభ్యసనానుషంగయై.

సీ. తపనకృపాణికాధారానిపతిత దానవరాట్కపాలమాలిక లనంగ
గర్వితాసురఖడ్గఘాతనిర్గళితాభ్రమణిఘోటకంఠకింకిణులనంగ
మందేహముఖదైత్యసందోహభిద్భానువర్షి లేఖ ప్రసవంబులనంగఁ
దరణిపాతధ్వనిస్తనితోత్పతద్గగనాంకోలలగ్న బీజాళులనఁగఁ
బ్రొద్దుగ్రుంకినఁ బోలేక పుల్లసిలుచు, బయటఁ బవళించునినుఁగొల్చుభటు లనంగ
జండకరసైన్య మందంద నండికొనిన, సుద్దపొక్కం డ్లనఁగ నిక్కెఁ జుక్కలంత.

చ. కుముదము వాఁడుదీర్చి ధరకుం గలతాపము దీర్చి మింటిబ
ల్తిమిర మడంచి పాంథులకు దృష్టియొసంగి చకోరికానికా
యములకుఁ బథ్యపానముల నారసి యోషధివృద్ధిగన్న వాఁ
డమృతకరుండు దోఁచెను సుధాంబునిధిందివిషద్విపక్రియన్.

క. ఆగారమరీచికి నుద, యాగతరక్తిమ విచిత్రమన నేల నిశా
యోగమున సుధారశ్మికి, రాగం బెంతయు నిరంతరం బగుటరుదే.

సీ. క్రొత్తలత్తుకబిళ్లఁ గొల్లలాడఁగఁజాలు రాగంబు తనురుధిరంబు గాఁగ
సారంగమదపంక సంఘాతకళంకంబు మానితోరఃపీఠిమసటు గాఁగఁ
జలదధ్వగులసోఁకు నులిచందు వెన్నెల లెన్మేను దొలచుపన్నీరు గాఁగఁ
వతసాంద్రచంద్రికాధవళితాంబరవీథిఁ బఱచిన పరిశుభ్రపటము గాఁగఁ

నంటమిన్న సముద్రునివంటి తండ్రి, పారమున కూర్మిక లానంగఁ బ్రోచి కప్పుడు
తారకాహితతనయావతంసకంబు, చంద్రుఁ డుదయించు బెత్తెఁగించె జగములకును.

క. అవసరవైద్యశిరోమణి, తోవతాపము దీఱ మందుఁ దూఁగించుటకై
యివల జల మింకవైచిన, నవనీత మనంగఁ దూర్పున న్నెలవొడిచెన్.

ఉ. చందురుకందు, ముందు పురశాసనుఁ డిడ్డరసాళతాంగపుం
గంబెన, క్రీడికూర్మిచెలికానిక నీనిక, యల్ల రోహిణీ
చందనగంధి గుబ్బచనుసాదన అొమ్మునఁ గాచుకాయ, సం
క్రందనమంత్రి దారయనురాగమునం గను డాగనం దగున్.

క. అత్తఱి వెన్నెలచేఁ దళు, కొత్తునజాండమున ఋక్షయుక్చంద్రుఁడు భా
స్వత్తక్రికలశి కుదుపల, మొత్తముతోఁ దేలువెన్నముద్దం బోలెన్.

శా. రారే కన్నగు చెక్కుటద్దములు దోరంబార నానందపుం
బారావారములో మునింగి కులుకుం బాలిండ్లపైఁ బల్మఱున్
జీరల్జాఱ బజారపుంబలుకులం జిట్టాడుచుం బాడుచు
న్నారాచొక్కుల దిక్కులం దిరిగి రెన్నం గన్నె లవ్వెన్నెలన్.

వ. ఆసమయంబున విలాసమయరామభద్రవిలోకనోన్నిద్రదయారసప్రసన్నంబు లైన వెన్నెలలు క్రొన్నెలతాలుపు సంజతిరుపుగట్టిన కొట్టువడి మైపట్టు సడలి భసితలసితంబు లన సాయంవికసితమల్లీమతల్లికా మరీచివీచిక లన డోలికాయమానమానసాధిక పథికవధూపృథుఘూర్ణవీథికామదనవివిధవిజయలబ్ధకుసుమాయుధయోధనిర్నిరోధవిశదయశంబు లన విశ్వవిశ్వంభరాగుంభననిరవకాశసాకాశవిరహవత్కాశినీశరీరశిరీషకాశనీకాశవైశద్యప్రకాశంబులన భూనభోంతరదంతురితకలహాంతరితనాయికానాయకానిలసఖశిఖాముఖంబునం గ్రాఁగి క్రాఁగి పైఁబొంగిపారఁ బోటినసుధాలహరు లన దండయాత్రాసముద్దండుండై పుండ్రకోదండుండు వెడలి ఖండపరశువుం జుట్టి వెండికొండకుం బుటము వెట్టినం గరంగి తొరంగు తరంగితతారనీరపూరంబు లనఁ దదీయామలకులంబున గగనంబు వగులుట నలుమొగంబులం బ్రవహించునంబరవాహినీశంబరంబు లన రాజు దానంబు సేయఁ దోయజార్భకాండ హిరణ్యగర్భంబునం బోసినసమధిక దధిస్నిగ్ధదుగ్ధంబు లన దుగ్ధపారావారకుమారకంఠీరవంబు కరనాళంబులఁ దారకలపయిం జిమ్మిన పన్నీరవారంబు లన గుండుంబులుఁగులవేఁటకాఁడు కాముకసంకేతనికేతగచ్ఛదిచ్ఛావతులపై వైచినపువ్వువలల చిమ్మనఁ దామరసాహితాలంకృతామరసరణిచామరచాకచక్యంబు లనఁ జెందొవవిందు వెలాని కెందలిరు విందున

కుం జుక్కలవెలందిమంది యలందినం జిందువెలందిగందవోళ్లన బృందారక బింబా
ధరాపయోధరధరాధరాగ్రపాతిమురాసురారాతినూతిభల్లనిర్భేదనగళితముక్తాహార
చూర్ణంబులనఁ బూర్ణసౌగంధికబాంధవుం డంధకారకంధరంబులపై గంధవాహాశ
రసంధానంబు చేయ నెగసిన ఋక్షరంగవల్లికాతల్లజరజంబు లన సౌధయూధంబు
లకు సన్నసున్నంబు చేసి విచక్షణసూక్ష్మతారాక్షరవాచక ధావనంబునకుం దావలం
బయ్యెఁ బొమ్మన బ్రహ్మాండ కరండంబు నిండిన రేయెండ చంద్రఖండంబు లఖండ
చకోరీకాండంబులు గని పయోభాండంబునకుం జొరంబడు నిబిడబిడాలజాలంబులలీ
ల నరవిందమరందంబునకుం గ్రిందుకొనుమిళిందబృందంబుల చందంబున నాఁపచే
నికిం దలఁపడునాఁబసరంబులపస మూరుకొనమెక్కి యామెక్కినలెక్కించి మిక్కి
లిం జొక్కిపడు జక్కవపడంతులును జక్కవలకుం దోడు మక్కువటెక్కువలం దగ
లి పిగిలిన మనంబునం గమనసమాగమంబున కెదురుచూచి ముదురుచందురువెలుంగ
సెకల శకలంబు లయ్యె సకలాంగంబు లని వకావకలై యిసుకల వసతుల నడుగిడ
నోడి సుడివడి త్రొక్కనిచోట్లుద్రొక్కి రక్కొన్న సురపొన్నగున్నలం గూడి త
లిరుటెండల వెడలినయుడురాడాతపంపుం బొడలకుఁ బొడలువెట్టి గట్టి ముసుంగిఁ
పొసంగెడి చెంగటి తిన్నెలం బైటఁబైఁట పైరిణీచెలుంగుల రింగున క్రొమ్ముడిముఁ
విడుటలెఱుంగక హృదయంగముల యంగముల బిగికౌఁగిటం బెనంగు ననుంగునుఁ
గులుకుగుబ్బచన్నుల యన్నులంగొంచి కన్నులవింటిజో దంపతులకువచ్చిన యీదఁ
పతులకుం జలువ చప్పరంబుప్పరంబు గామి చెప్పకప్పటి కిప్పటికిం జొప్పడ దిక్కట
కి కట్టెండ నెట్లుండ నేర్చితో యని కటకటంబడు కటతటాశ్రుధారాపాతభార
న్వితవియుక్తశాతోదరీ సముదయంబును సముదయంబునునైన కౌముదీజాలంబుచే
జాలుకొన్న మున్నీటి పన్నీటి పట్టికల పాషాణపుఁ బట్టికల మెట్టికల నీరుఁగా
చి భవదీయ విపంచికాసంచిత సముంచిత సంగీతభంగిం గరంగిన రాల జలంబనెడి
జనఖుల నిఖిలముఖస్తుతికి నంగీకరించుకురంగీలాంఛన శిలాంచన చణవితర్దికాంతదే
విశ్రమణశ్రేణి విశ్రితశ్రేణి వైణికశ్రేణియుం గరంగి రేతేని రాణించు నయ
వసరంబున.

క. అటవి దిశాకటకసమ్ము, త్కట నిష్కుటవాటి గోపికాపికవాణుల్
నిటలాక్షభయదభల్లక, భటకుటిలభ్రుకుటిభగ్నభగ్నాశయలై.

క. కటికి తొగరాచయెండలు, పిటపిటఁగాయంగ మేను బీఁటలువాఱెం
గటకట [illegible] ముసుంగా

క. ఒంటికి నెటులుంటివో వా, ల్గంటినిఁ జేరొక్కన్నఁ గళవళంబున నాపే
రంటిన పలుకులు గనునీ, కంటి కరయో! నిదుర యెట్టుఁ గంటి మురారీ!

క. గబ్బిచెలీ! గుబ్బలి నీ, గుబ్బని మది నుబ్బి కేలఁ గొని యెత్తితిఁగా
కబ్బురువున కేనాయిది, దబ్బరకా దన్న వలపుఁ దలఁపు మురారీ!

క. బాల భవ దధరశర్కర, వేలాగులఁ బోరిచె దానవిధవకృతముల్
నాలుక చేఁ దుదరము మ, ట్టేలాడు నటంట నుఱచితేమి మురారీ!

ఉ. రాతిరి ఊతిగుండె నధరం బిడకుండిన రాక యుందువే
వా తెర దొండపంటి చవి హాసిగదా కొదదీ ఱెనంచు రా
వైతివి బింబసేవనమయారె వహామతి హానిసేయుదే
యాతటిఁ జిల్కరాచమువు లింతి యుదాహరణంబు లోహరీ.

ఉ. క్రిక్కిఱియం గవుంగిట బిగించెదు నీయెదకౌస్తుభంబు నా
చిక్కని గుబ్బసందిటను జిక్కను దుత్తుము రా నటన్న నీ
చక్కెరమోవి మానికమె చక్కఁగఁ జిక్కె నదేటి కన్న మే
ల్గ్రిక్కన నెక్కళావతికిఁ గానుక చేసితొ నందనందనా!

ఉ. పాటలగంధి నీ పెదవి పైకొను నాపలు మోపఁగాఁ జుమీ
మీ టమృతంబు కఱటె నని మెక్కుమఘాన్నము వజ్రి సత్రపుం
గూటికి మాధురీమహిను కూడదు సున్మనుకొన్న ముచ్చటల్
మాటికి నేవధూటికి సమర్పణచేసితొ కేశిమర్దనా!

సీ. కేళీవనీవేణుగీతాగతభుజంగభీను తత్పత్రశ్చపేటపములు
చుంబనవితరణాసులభాంతరంగముత్కంఠపీతార్పిత కౌస్తుభములు
గళనఖాంకావలోకనరక్తదృగనుక్తమద్గాత్రపతితత్వదుస్తతములు
భూపగోష్ఠీదారిద్రిమాపరాధానీత పరలబ్ధమణిసాలభంజికములు
శారికోటీరితాన్యోన్యసరసతములు, వింతలు దలంపవైతిగా యింతయైన
యనృతసంసార బర్హిబర్హావతంస, కంసవిధ్వంస హృతగోపికారిరంస.

సీ. హరిశిలాసారంబు హరియింప నెఱివేణి కనుదోయి బాణరేఖను హరించె
మధురాధరోష్ఠంబు మధువిదారణ మానఁ దాళభేదము పయోధరము లానె
రోమాళి వ్యాళవిరోధంబు నొందిన శకటాంగదమనంబు జఘన మొందె
నూరుచారుత వారణోత్పాటనముఁ బూన హంసాపహృతి పూనెయానమహిమ

మహిఁ నీయొక్కయంగంబు మాఱుగలదె, యేనెదురె నీకుఁ దప్పు సహింపు మనిన
దయ దలఁపవైతి హరి హరిహయమహీజ, హారి యమునావిహారి మురాసురారి!

సీ. అతను తుపాకిగుం డటులుండు మనియెఁగా యతినిష్ఠురశరాగ్రి మడ్డగించి
వలరాచతూపు దైవము తొలంగించెఁగా యతులకృపాణిచాఁ టగుటఁజేసి
దర్పకకరవాలధారఁ దప్పించెఁగా యనుఁగుఁజేనుఁగు మఱుఁగైకడంగి
రతిరాజ భద్రేభరాజంబు నిలిపెఁగా బలితంపు రాతెట్టు గలుగఁబట్టి
యంచుఁజెలియంచుఁ జలియించు నసమభసల, కుసుమకిసలయ పికశాఖలెసఁగఁగాంచి
పంచశరశాత శరజాత పాతజాత, భీతి యేరీతిఁ ద్రోచెదో బిసరుహాక్ష.

సీ. నీసోగజడఁ జూచి యాసూటి సాన నంపముగఁ బట్టించితి నందకంబు
నీచిన్ని బొమదోయిఁ జూచి మేల్బంతిగాఁజక్క దిద్దితి వంక శార్ఙ్గమునకు
నీమోవిజిగిఁ జూచి నిన్నమొన్నను మెఱుఁ గింతవెట్టించితి హృదయమణికి
నీచొకారపుమేనుఁ జూచి పచాటంటి వన్నియఁ గూర్చితి భర్మపటికిఁ
గలికి నీజంఘ పసఁ జూచి కౌదెమకర, కుండలంబులు చక్కఁ జెక్కుటకు నిడితి
నొక్కనిమిషంబునినుఁ జూడకుండఁగలనె, యనినమధురోక్తి మఱవితేయంబుజాక్ష.

మ. విమలాంగీమణులందు నీక తగుఁబో వేణీభరం బెంత్త యం
దమువాటిల్లె నటంటి నాఁటికి ముకుందా నేఁడు నీకేటికి
యమునావీచివిహారమో, భుజగభోగాగ్రైకలాస్యప్రపం
చమొ, తాపింఛవనీతలాంచశిఖిపింఛప్రేక్షణాపేక్షయో.

శా. మందారాగమకేళి హేలితనయాంభఃక్రీడనాభోగ మా
బృందాళిందవిహార మామురళికాభీష్టారవాకృష్ట గో
బృందప్రోన్నమిత శ్రుతిశ్రవణసంపత్పాపరం బట్టి యా
నందం బౌనొకొ యింక నొక్కపరి కృష్ణా వృష్ణివంశాగ్రణీ.

గీ. అనుచు గోపిక లోపికల్ హావణుపడక, తమి నిలుపలేక తా మట్టి తమునిఁ జంప్రి
మీనకేతను లిద్దఱు మింట నుంట, మందుమను జెందుచుండు దంభమున కలిగి.

సీ. మొదల వనగ్రామమున జన్మమొందుట పాడయెన్మై నెమ్మనఁ గడలు కొనుట
పాంథసంఘములకు భయమింత చూపుట గట్టిగా వృగి ననిఁ బట్టుకొనుట
పశుపతి శీర్షంబుపైఁ జౌకళించుట నఖరపాదాహతి నాటు కొనుట
నూతపు సత్సంతానమున వాసి లోఁగొంటి పుండరీకపదాఖ్యఁ బూనుకొనుట

చెబ్బులికి నీకు నింతైన భేదమేది, పదరి కన్నులముందఱఁ బడ్డవానిఁ
గాని చెనకనిగుణ ముండు దానియందు, నొకటి కారుణ్యరహితవో యుత్పలహిత.

ఉ. తెల్లని మంటగాని యిది తిన్నని వెన్నెల గాదు కంటివా
హల్లకమిత్త్ర నీదుసెక లంటమి మింటికి గందు వొందునో
నల్లనిదానొ కల్వ నిశ నైల్యము నొందునొ మేను గందునో
యల్ల తమోగుణంబు నలుపందునొ కాళిమ రాహు వొందునో.

ఉ. వెన్నెలచొక్కుఁ జల్లి యరవిందకులంబుల నిద్రఁదేర్చి పై
నున్న సిరిన్ హరించినటు లోహరిణాంక వెలుంగు కత్తులం
గన్నెలయంగముల్ నిశినిఁ గన్నము చేసి ప్రమోద మెత్తఁగా
మున్నఖిలాజ్ఞ కర్తఁడవు ముచ్చులరాజవుగాక రాజవే.

శా. న్యగ్రోధాంకుఁడు సోముఁ డంధకహరుం డాప్తైణుఁ డీపాటనో
యుగ్రత్వంబు ఘటించె దంతిపయి నోహో యైన నేమాయె నే
కగ్రీవంబుగఁ గంతుఁ డుం డిరుగఁబోఁగా వానిఁ గ్రోధాగ్ని సా
మగ్రిం గాల్చిన నీవయీశ్వరుఁడ వాహా రోహిణీవల్లభా!

సీ. ఉదయరాగంబు నీకెక్కుడిది మృగాంక, కామినీకంఠరక్త మాకంఠముగను
ద్రావఁదత్కాంతి వెలిఁగ్రమ్మెఁజూవె కాక, యున్నఁగడు పిట్టితన్నులుదన్నెటెట్లు.

క. కలహించెఁ గాని నినుమొ, క్కలమున రాహువు గళంబుఁ గబళించినచోఁ
గళ దాఁకి పడినచంద్రా, కలకంఠీకులము లింత కలవర పడునే.

క. ఉదయాస్తమయములకు నీ, కుదనిధియుదరంబె మార్గ మొక మకరియుని
న్మదమడఁగింపదు కరిబలెఁ, దుదినేటికి నైనఁ జేరి తోయజవైరీ!

గీ. పంచశర నిన్ను వజ్రి చేపట్టి పిడుగు, తునుకనంచు గిరీశుపైఁ దూఱునటుల
నచలకుచలంచు గర్జించె దార క్రీడఁ దోడునీడలపై దాడిఁగూడు టెటులు.

ఉ. ఏయెడ విల్లునమ్ము లొకయించుక యేమఱ కుంట పాంథులం
గూయఁగఁ బట్టి గొంతుకలు గోయుట యీశ్వరునంత వానిపై
సాయక మొక్కఁడేసి పగసాదుకొనం దుది సూడుదిప్పటన్
బోయకు నీకునంతరముఁ బొందునె యెందును శంబరాంతకా.

మ. తొలుదొల్తన్ హరిచేతఁ బెంపుఁగని తోడ్తోడన్ గిరీశున్ హళా
హళిమై నోర్చి మహాసితాంగరుచి సామర్థ్యంబు మీఱ న్సదా

నలసద్విగ్రహారాగహారి వగుటన్ ధాత్రి స్వేతం బెట్టుచో
నిలయందు న్మనివాటకా దళని వై తేనుందు శ్రీనందనా.

సీ. నారీకవచునోర్చి నగెఁ గాక భృగుసూతి నారీకవచు నేసెనా శరాళి
విఱిచికొనియెఁగాక విలు జానకీజాని విఱుగనేసెనె యుమావిభు మనంబు
వింటి పిట్టాడిచెఁగా కొంటిపోరున శూలి వింటి పెట్టునఁ భార్థు వెతల నిడెనె
యనలంబు సొత్తుఁగా ననియెఁగా కహితుపై ననలంబు వర్షించెనా నరుండు
నాకరణినంచు విలుకాండ్ర నైకమునకుఁ, బుండ్రధనువున వేతురా పువ్వు విరుదు.
నిన్ను నీచాప ముగ్రులై యున్నవారు, నమలి పైనరె తమతాత్రిణ నలినబాణ.

క. ఏనారిసుఖము చెందదు, నీనారియె నారి యైన నీనాళీకం
బేనాళీకం బైనన, యోనాళీకాక్షి తాప మొందునె మదనా.

క. గారుతమాహాత్మ్యాశన, ధీరుతమా మలయనేల భృతమధుకరవా
మారుతమా మలయాచల, మారుతమా నీదు కానిమఁది మారుతమా

క. అలయించనేల మహిశీ, తలతాలవనాచలంబె తలతాలవనా
నిలయంబునీకు గంధపు, మలయానిలమా యకైన మలయానిలమా

క. పవనము బంధించు ముని, ప్రవరులు లేరైరొ సతుల పైఁ బగ యతి నాం
పవలసి యంపిన జతరో, ధ్భవశిఖిఁగూడితివొ సిగ విదిర్చెదు పవనా

క. కలకంతులెంత సర్వ, జ్ఞులకుం గుత్తుకకు డిగని జూటందురు ని
న్నలినీకులమాపరిచిత, నలినీకులమా గరంబు నలినీకులమా

సీ. హరినాయవారిదంతగిరిదుర్గసమయయామికభుజోన్నమితదీపిక యనంగ
శీతాంశుసారంగశృంగరంధ్రకృతాచ్యుతజాండఘుటలిప్తసుధ యనంగఁ
ద్వ్యక్తతారాద్యపుష్పాలివేళార్చకార్పితవిష్ణుపదపుండరీకమనఁగఁ
బాకశాసనసుదానేకపోక్షిప్త హస్తలతాగ్రమన్మథఫలమనంగ
శకునిశబ్ద సమారంభసంభ్రమమున, కవసర గణాధినాథోపహారమపుడొ
నర్ప నిడు నారికేళఖండం బనంగ, దిక్కులటఁ జొక్కుచన వేగుఁజుక్క వొడిచె

చ. కనుకలిపాత్రపై నిడుజగంబు తృణంబున నెట్టు లీడ్చి నన్
బని వినిస్నేహమున్విడక బల్లిశ లోఁగొని యొజబంతి చూ
పినవహికిం బితామహుని భీరువు మెచ్చి స్వకీయరూపశో
భనకళలిచ్చె నో యనఁగఁ బాండురరూపము లయ్యె దీపముల్

శా. ప్రాక్కోణాంబరవీథిరీతిఁ గులటాపాళీముఖాబ్జంబు తె
ల్పెక్కం బాంథుఁడు ధట్టి గట్ట దనవి ల్లెక్కూడ్చి నాల్గింటిపై
లెక్కమ్మల్లొనవైవ భావజుఁడు బ్రలెక్కార్పు ప్రిక్కల్గినన్
గొక్కోక్కోయని కుక్కుటచ్ఛటలెలుంగుల్లెక్క నల్దిక్కులన్.

సీ. ఈతమ్మిమొగ్గతూపిభగామినీస్తనకాఠిన్యమిం తని కాంచి వచ్చె
నీసంపగిలకోరి హేలావతీతనూ మృదుభావ మింతని యెఱిఁగి వచ్చె
నీకల్వనారసంబిందీవరేక్షణాదృగ్ధైర్య మింతని తెలిసివచ్చె
నీకెంచలిరుఁజిల్క రాకేందువదనా పదారుణ్య మింతని యరసి వచ్చె
ననుచు శరసాహసము వసంతునకుఁ దెల్పఁ, బథికభీరుభిదాలసబాహు కలుక
నతనితోడమీఁద శిరసింతహవణు పఱచి, పువ్వులంగడిఁ గనుమోడ్చెఁ బువ్వుఁబోఁడి

క. రజనిఁ బెడఁబాసి తారా, నిజసౌఖ్యము డించి కుముదినీసతి విభ్రాంతిం
బ్యజియించి యట్టియెడనీ, రజనీవరుఁ డపరదిక్కుప్రిక్కకుఁ జేరెన్.

గీ. అమరులారగించునట్టి పళ్లెర మెత్తి, వేళపేరదొంగ వేగుటెఱిఁగి
ప్రొద్దుగ్రుంకఁదూర్పుభూమిఁ జేర్పఁ దలంచి, విషధివై చె నన<గ విధుఁడు గుంకె.

చ. చనునెడ రేయికే లూడియఁ జందు విదిర్పఁగ నందు మిట్టిరా
లినయమృతంపు చిందు లన, లేమను బాసిన సోముఁ గామఁ డే
సినవిశిఖాళినా, శశి నిశీధిని తమ్మిసిరిన్ హరించి పో
వను వెనుకొన్నహంస భటవర్గములో యనఁ, గ్రుంకెఁ దారకల్

సీ. ఇనుఁ డగ్నిరుచి చేర్చు టెఱిఁగి శైత్యము శశి తన కిచ్చెనా గాద్పు గనియెఁజలువ
రవివచ్చు నని యంబరముఁదో్రిచి చను నిశాధిపు నవ్వె ననఁ దూర్పు తెల్లనయ్యెఁ
దనరాజుఁ బ్రిహసించి తనరారుప్రాక్ప్రిమద నదల్చెనా ద్విజోత్కరము మొఱసె
ద్విజకోటి నిజవాటి విడిచి పోఁ బ్రిచి కన్నెఱ చేసెనా రాగ మింత తోచె
వేగ నలవాసరేశ ప్రివేశమునకు, గగనగృహశాంతి కిడు పూర్వగవ్యాకింద్రి
కలశచూతప్రవాళ రేఖలో యనంగ, దినమణిమయూఖములు కొంత తోచె నంత.

సీ. జంభారి హస్తాంకుశతుప్రిటత్కరికుంభతలనిర్గళదస్రిక్తధార లనఁగ
వృద్ధశ్రీపో దిగ్మహీధ్ర వేణూద్ధితకృద్ధ దావానలాంకురము లనఁగ
కుత్కీలపత్రినిర్భిత్కతుద్భిత్తికాశ్రితశోణమృత్తికారేఖ లనఁగ
సౌధాశనాధీశసౌధవీథీధ్వజప్రిజషోమకాండవర్గము లనంగ

స్వర్గదుర్గాధినాథ దిశావిశాల, శరధి కూలప్రవాలపల్లవ లనఁగ
దరణి కిరణప్రకాండము ల్ధరణిచక్రి, చక్రవాకావలోకోత్సవంబు నెఱపె.

క. నడయాడు మబ్బు కఱుదుగ. నుడుమార్గముఁ గాంచి మఱి యునొక్కటి యి
జడధి యనిక్రొల వెడలిన, బడబానలన మనఁగఁ గడలి భానుఁడు వొడిచెన్

మ. కర మయ్యెం గర మయ్యెడం గలువకుం గంజాప్తుఁ డేతేర మే
దురమయ్యె దురమయ్యెదానురతులందుం గోకికిందిక్కు-భా
స్వరమయ్యె న్స్వరమయ్యెఁ దమ్మి తిమిరవ్రాతంబు వ్యత్తారకం
దరమయ్యెం దరమయ్యె నిచ్చలము నానాఘూకపాకాళికిన్

సీ. ఒకమయూఖంబు నిర్వికసిత సారసాళిక కూరిరపుం జెలువ్వడిపించె
నొకగభస్తి నిరంకుశోద్వృత్తిఁ గదిసి యున్మదకుముదిని రేకు మడఁగఁగొట్టె
నొకఘృష్టి యింత కొంచక చిమ్మఁజీగిన గర్వాంధ పటలి దిక్తటుల కొత్తె
నొక కిరణం బింత సకల దోషాకరవ్యథ గన్నయన్నుల వడఁకుఁ దీర్చె
నప్రతీప ప్రతాపానలప్రభుండు, చక్రపరిపాలన క్రమాపక్ర మూర్తిన్
రుచివిజిత రాజ పరమేశ్వరుండు సూర్యుఁ, డుదయగిరి సింహపీఠిపై నున్న వేళ

మ. అరిరాజన్యక జన్య జన్యజయవారాధేయ రాధేయఖే
చరవిత్తేశ సమానదాన కలనాసారస్య సారస్యదా.
శ్వరజోల్లంఘితచక్రవాళ సకలాశాఖాంత శంఖాంతరా
హారహాఃకమ్రసురద్రుకీర్తికృత సౌమారోపమా రోమాపమా.

క. దుర్మదరిపు మర్మదలన, ధర్మ పరేతరతర ప్రతాపతపన ది
జ్మర్మ సతీ కంఠాలం, కర్మ కృతియశః ప్రపూర్ణ ఘనకర్పూరా

భ్రమర కూజితవృత్తము.

శారదాలలితచారదాయి ముఖ సారసాంకురిత సౌరభా
సౌరభాసు పవిహార ఫాలశిఖి సన్మహః పవన సారథీ
సారథీనమిత గీరథీన కవి సంస్తుత స్వగుణ గౌరవా
గౌరవారిరుహ హీరవాద విలగద్యశఃకృతవిశారదా.

గద్య. ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్రకరుణానుగ్రహాశాశ్వతైశ్వర్య ధుర్యతామహో
రూపరేఖావిజితరతీశ్వర సరససంగీతసాహిత్యసకలకలావిచక్షణ సమాశ్రితవిద్వత్
క్షణదక్షవీక్షణ యనిగెలగోత్రపావన పరిపంధిరాజకల్పితపాదసేవన దామరల వేం
ధీశపుత్ర చెన్నభూపాలకకలితసామ్రాజ్యగురువమాంబాగర్భశుక్తిముక్తాఫల గురువ
భవద్భవశేషభాషామనీషాబల ప్రతిదినాగతార్థి జనవరప్రదాయకశ్రీ వేంగళ సా
ణీతంబైన బహులాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునం ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు

# బహుళాశ్వచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీవేంకటేశసేవా, ప్రావీణ్యా విరోధిధరణిపాలశరణ్యా
పావన సద్గుణగణ్యా, శ్రీవేంకటభూవరేణ్యా చిరతరపుణ్యా.

వ. అవధరింపుము జనమేజయజనపునకు శుకుం డిట్లని యానతీఁ దొడంగె నాతఁ
సవ్యస్న మాయాత సాత్రాజితీ సమేత నేతకుఁ బ్రాతరుద్భూతఖద్యోత సముద్యో
జాతసంజాతవాతపోతశీతల ధౌతపదనారవిందునకు విందుఁజెప్పి యాజ్ఞానక జన
కుల తిలకంబు జలకంబాడి నిత్యకృత్యంబులు నిర్వర్తించి కందర్పజనక సమర్పి
త నాడింధమపాణింధమ మణిబంధ మణిభూషణాదుల పనులు గాంచి పురాయి
కులాయికోపరి పరివేష్టి తోష్ణీష దక్షిణభాగ భాగాయిత లిఖిత శుభ్రకలాశక
వ్యూహస్తపుట ఘటిత సంపుట శటీ పటిష్ఠ కార్ణాటిక గణకగణ విభక్త ధర్మ
సంఖ్యాసంశ్రవణంబునకు శ్రవణంబొసంగి సంగీత భృంగీతతచకోరానకురప్రికట
ద్య పద్యకలా కలకల హృద్యవిద్యామంటపప్రాంత కాంతనిశాంత లతాంత
సేవక జాతక నీతకరవీర కేతక కేశక హల్లకఫుల్ల కనకమల్లికా మాలికా పాలిక
లోకించి కించిదీశానదిశావిలోకిపాకశాసనశిలావిశాల సమీపసమీచీనపటీర
టీరకుటీరతటీరమణీయపేటికాశాటికాగ్రంథివిభేదనమాత్రఘుమఘుమాయమాన
త నిస్తులవాసనావాసితవలయబండారపరిచారికదత్తతూలోపల పరిమాణపరిమితప
మిళితఘనసారసారంగమద కాశ్మీరపేషణవిశేషణనిపుణభృత్యపాణిపాషాణతర్జని
వనమార్జనంబుజ్జగించి మజ్జనగృహాభిముఖనఖరమయూఖనిఖిలాశావేశవాసవాసజని
జ్యమాన నానాప్రసూనచయకాచవిచలదాచ్ఛాదితపనసఖండకుండికాకాండ నా
జికోజ్జ్వలజలశీతల కరతలస్పర్శనంబునవిమర్శించిదర్శనీయశయ్యాసన్న భిన్నభిన్నా
నేక శాకానీక గుబగుబధ్వానోచ్చసూచ్యానినాదభేదాహీనవాయ్యంగణహింగు
మాషసర్షపమరీచాదిగంధబంధుర మందిరప్రాంగణ వితర్దికాసంగత దేవతా
తామాత్యనికేత నాగతానూతనవేణుపుటికాపూపభూమీపరిపాకచూతావళీపనసఫల

తాపవాతాచ్ఛాదభేదవిచ్ఛిన్న సౌవర్ణపాత్రిజాత శాతకుంభరంభాపర్ణపూర్ణసౌభాగ్య భోగ్యాశనశతాంగభోగ్యహితాయోగ్యజాంబూనదాంబరాభరణమృగనాభిముఖ్యసమస్త వస్తూపాయనంబులఖిలదేశాధిపత్యమాత్యవర్గంబులకుం జూపిగోపికాపికానులాపికాంత రగృహపర్యంకకుంకుమకశిపుతలోత్తానశాయితసత్యాసత్యమధ్యమాంకేమూర్ధోపధానతా మానవవత్తతాంబూలీదళ ప్రసారితకరాంభోజతాక్రీడితపాదనిష్పీడితప్రీడావతీకుచ కుంభకు యశోదాకృశోదరీడింభకుం జేరి జలకం బవధరింపుఁ డని విదేహమేదినీభర్త కర్తకు భోక్తకు భక్తకుటుంబసంభరణ జంభసంభేదితరువునకుం దరువు వెట్టిన.

ఉ. గ్రిక్కున లేచి యాచిగురుఁగైదువు జోదును గన్నమిన్న సొం
పెక్కిన కెంపురాపనులయిక్కగునొక్కలు సేరి మజ్జనం
బెక్కడనాడి భూషణతులాంబరచందన పుష్పమాలిక
ల్చక్కధరించి మేచకకచానిచయంబులు చెంతఁ గొల్వఁగన్.

క. వెన్నుఁ డిటు లున్న సన్నపు । నెన్నడుము వడంక వచ్చినిద్దపునవలా
మిన్నయొకబోనకత్తియ । యున్నతకుచ వంట యమరియున్న దటన్నన్.

ఉ. అంగమునం గురంగమద మందముగాఁగ నలంది మాళిసం
పంగివిరుల్ సిరుల్గన రుమాలు ధరించిరుటంపుటంగిపై
రంగుమెఱుంగు బంగరుచెఱంగుల రెంటెము నాల్గుకొంగులు
నిర్రింగులువారఁ గట్టి సుమణీరమణీయసరాభిరాముఁడై.

మ. నలువైపుందలకందుకాన్పుపసనున్నందామరందంపుఁబొ
క్కిలిచే మిక్కిలి నిక్కువాఁడు మెఱుఁగుం గెంజాయగింటెంబువాఁ
డలరుంగత్తిదొరయ్య యొయ్యరపుటొయ్యారంపు నెయ్యంపుఁదొ
య్యలు లేతేరఁగ భోజనంపుటరఁగొయ్యంజేరి తానయ్యెడన్.

శా. అప్పాబోఁడుల కొక్కరొక్కరికి స్వర్ణాపాత్రము ల్జాళువా
డొప్ప ల్గొన్నియుఁ గొన్నిగిన్నియలు గిండ్లుం గూర్చి నల్వంకల
న్గొప్పల్విప్పలు లేఁతలౌనరఁటియాకుల్వైచి వైచిత్రిరాఁ
జొప్పుల్గానడలేర్పరింప హరి కూర్చుండె న్వధూయుక్తుఁడై.

ఉ. వన్నెమురారి దుప్పటిని వాల్యఁగఁజాలు పిసాళి మేనులు
న్చన్నమరేలఁదెచ్చు నగుమోములు గొన్నవిల్తుఁగన్న య
క్కన్నియయిల్లు నిల్పుతెలిగన్నులు క్రొమ్మెఱుఁగులు గన్న ఫాలము
ల్చెన్నులు చిందఁ నందఱును జేరి సువారపుటింటిముంగిటన్.

ఉ. పుట్టెలుమ్రోయఁ గక్షురుచి మార్మ్వలయం గడకంటిబేడిసల్
మిట్టిపడం బయంటు చనుమిట్టల కట్టిటుఁగాఁగఁ జెక్కులన్
బెట్టిన కమ్మతల్కు మిఱుమిట్లు గొనన్ నుసుగీలుగంటు వె
న్పట్టుఁగనం గనత్కనకపాత్రిక లెత్తిరి జోనకత్తియల్.

గీ. కూర లందఱు నంద మంకూర మొందఁ, జేత నండలి యొకతె హస్తారవింద
సారవల్లిలఁ గొనియె నాకారవల్లి, కారవల్లిన ద్రాఘిష్ఠ కారవల్లి.

గీ. శ్రవణనక్షత్ర నిభ మణిచణము లైన, శ్రవణతాటంకయుగచకచకలు నిగుడ
రవణ కంకణపాణిపల్లవము సాఁచి, లవణ మొక్కలతాంగిలలాను మిడిమె.

ఉ. బంతులు గట్టి గట్టిచనుబంతుల మెట్టిన తారహారముల్
గంతులువైవఁదుమ్మెదల గంతుల వంతులు తోడఁ గొప్వనే
వంతులు కాంతు లూన గుణవంతులు వంతులకున్ నుతింపఁగా
నింతులు కూరఁగాయ లిడి రింగువ సొంతి తగుల్ బుగుల్ కొనన్.

గీ. అంపంపఁ దిరుగబోఁత బు, గం దింపఁగ గుడము నిగుడఁ గమ్మని నేతం
బొందుగ వేఁచిన వేఁపుడుఁ, గంద ముకుందాదులకు నొకతె వడ్డించెన్.

క. రోఁకలికైదువదొరతోఁ, డాఁకలిచప్పలు హరించె నంచుం జెన్నున్
గాఁకరబోండ్లు హరిం గని, కాఁకరపాట్లాదిగాఁగఁ గదియించె రెడన్.

గీ. తనుసుమధ్యమ గెనుసు చందనసుగంధి, పనసకాయ సునాస రంభాశలాటు
బిసరుహేక్షణ పెసరప ప్పసదృశాంగి, పసిమిఁగందని వంకాయ బంతికిడియె.

క. గాఢకనకాంబరం, బాషాఢకనచ్చంచలాప్రచారము చూపన్
బ్రౌఢకలకంఠి చేరిచె, నాఢకసూపంబు నృహరి నారివాణమున్.

క. అప్పుప్ప పసిడిపండిరి, మెప్పింపంగాదు నిజము మే లని పంపెం
బప్పటి కొప్పిరి కొందఱు, కుప్పలుగా సెనగపప్పు గుప్పినయెడలన్.

క. తలతలమను మల్లికలం, గలఁకల నిడి తమ్మిపూలఁ గలకలనగుచున్
మిలమిలలై తలతలలై, కలగల కలమాన్న మిడిరి కలగలలలనల్.

సీ. పొన్నట్టుఁదట్టఁ జెబూని యన్నము వంచె వలచేత లతవిరుల్ వంచెననఁగ
నీయన్న మాన నీ కిచ్చు యిచ్చితి నన్న జాడ నన్నము ముట్టె చక్క నొత్తె
నంగనమ్రిత చూడ్కి యవనీతలం బంటె వెడవిల్తుఁ డెక్కిడు విల్లువోలె
వంటందికొన నిల్చు వామ వేణిక నల్లె వెనుగన్న యొకూర్కడ్పు ధను పరంగ

గీ. అంగసలు వడ్డనకుఁ దెచ్చునట్టి పసిడి, యట్టికలు లాగి శాకముల్ పెట్టెఁ గాని

యట్టియెడ నెట్టియెడ కంభ్రి మెట్ట కప్పుడు, చెక్కిలివిరాళిగొని యొక్క చక్రజఘన.

గీ. నుదురు జాబిల్లిపిల్లతోఁ జదురులాడ, నెదురు కాఁగెడుగుబ్బల యింతి యొకతె
కుదురుగా గిన్నె యిడి వంచె గోఘృతంబు, విదుర విందారగించిన విదురునకును.

క. గంబూర మృగమదంబుఁ గ, దంబించిన మంచి చల్లఁదనపుంబానీ
యంబుల జాంబూనదపుం, జెంబుంచిరి సాంబు తంత్రి చెంతం జెలువల్.

క. బంగారులభృంగారుల, రంగారు నిజాంగకచభరస్తనభరలీ
లం గారులు వల్కు సతుల్, భృంగారులు నిండజలము లిచ్చిరి ప్రజకున్.

క. జలసేవనఘుళఘుళ లు, ప్పలముల పళపళలు భోక్తృభళభళ లబలా
వళి పటపెళపెళ లంగద, ఝుళఝుళ లేకీభవించె జనము నుతింపన్.

క. పులిచారువంచె నొక్కతె, పులిచాఱలచీరఁ గట్టి భోక్తల కేకా
వళిచారు చంచరీకా, వళి చారు చలత్కచాళి వహి మహిఁ బొగడన్.

క. అజ్జలజముఖులు కాఁచిన, మజ్జిగరసమేమి చెప్ప మఖవంతుం డీ
వజ్జిహ్వారుచిఁ బగిలిన, మజ్జారే యమృతరసము మఱికొనఁడు సుమీ.

గీ. ఆమ్ల మారీచ లవణ గుడాదికములు, దండిగా వండి గొప్ప పసిండిగరిటె
నేఁడివేఁడిది వడ్డించె వేఁడివేఁడి, నాతి కూష్మాండఖండకాండంబు లొకతె.

ఉ. చెక్కుల నాభినామమును జిన్నిరుటాల నిటాలసీమలన్
వాక్కులఁ జంద్రఖండములు వంచినవైఖరి చంద్రఖండముల్
జొక్కపుచందురిఖండములు సుమ్మన వంచె మెఱుంగుఁజేతులన్
మక్కువ జెల్వితండములు మాఖకళాకృతచంద్రఖండముల్.

క. తేనెతోలల్ వలె విలసిలి, తేనెతోలల్ చిగురులనెడు తియ్యవాతెఱలన్
దేనెతెరల్ గల తెఱవలు, తేనెతోలల్ వంచి రెడల దెప్పలు గాఁగన్.

క. ఉక్కెఱకున్ బుఱ్ఱడలపైఁ, జక్కెరకున్ వడలపై నొసఁగు తేనెలకున్
గుక్కిళ్లు మ్రింగు టరుదా, పుక్కిళ్లంబెట్టుఁ జందములు విన్నయ్యాల్.

క. జిడ్డుంగడలిదొరల్లుం దొడ్డుకొనందోడఁగెఁ గేలియొడ్డున్నవలా
లిడ్డ తెలినిగ్గటిడ్డెన, వడ్డనకుం దొడ్డలడ్డువాల్ వంచుటకున్.

క. కలకంటర క్రమగాత్రలు, గల వంటకుఁ [illegible]పులు తెలుపఁ గలఁ కంఠమునన్
బెళుకంటుఁ జెలఁగఁ జెలి బం, తుల వెంట బయంటచెలఁగు దుసికలఁ బడియెన్.

గీ. మొగడచన్నుదోయి జగడంబు దెల్పెడు, పొగడపువులచేల పొగడు గనఁగ
నగరిబోనకత్తె నగవిపూపలవేణి, శిఖరి వంచె నొక్క శిఖరిదశన.

క. రసదాళి చెఱకుపాలూక, రసదాళి రసాలసాలరసబహులహస్తి
రసదాళివేణి వాణిక, పసదాళి సురారి విసరు బలియున కొసఁగెన్.

గీ. కంద బజ్జి సమర్పించెఁ గంపకబరి, పాలతిమ్మన మిడియె శంపాలతాంగి
పాయసము వంచె జలజరూపాయతాక్షి, ఖండశర్కర వెట్టె శ్రీఖండగంధి.

క. విచ్చినకలువల పైమురు, విచ్చిన దృచ్ఛరచరీక మే భ్రమరిగొనన్
కిచ్చడి పండ్లరసావళి, పచ్చడి యొక కృచ్ఛడీక బంతుల కిడియెన్.

క. కారు మెఱుఁగు తనువారుల్, న్వారుల్ చేసిన విలోకనమ్ముల నారుల్
నూరాఱు వగలఁ బెట్టిన, యూరుంగాయలు ఘటించి రొండొరులకలన్.

గీ. నెచ్చెలియొకర్తు వడ్డింపఁ దెచ్చు పెరుఁగు, వచ్చు సుధసాటియనఁ బోరెంఁ దెచ్చు పెరుఁగు
దాని రుచిచేత శుచికరాతపము పెరుఁగు, వెఱఁగుపడు వెన్నముచ్చులు వేలు పెఱుఁగు.

క. ఆవుల నేతికిఁ గమ్మని, తావులపరమాన్నములకు దధికి పయస్సం
సేవకొక కేలు చాలక, గోవిందుఁడు భుక్తిఁ దలచెఁ గుడికేలిగవన్.

మ. మృదులాన్నంబు మృగీమదోపమఘృతం బింపారగాఁ బెల్చి తా
ళిదముల్ కమ్మనియార్పులుం బడిదెముల్ క్షీరాన్నముల్ తేనెలుం
ముకురంగాఁగిన పాలు చక్కెరలు జున్నుల్ బజ్జులుం బచ్చడుల్
కదళీముఖ్యఫలావళుల్ దధియుఁ దక్రంబుం బ్రవర్షింపఁగన్.

క. సూపములతావి సకలా, పూపంబులవలపు శాకములసౌరభ మా
జ్యాపారపరిమళము నా, నాపాయసగంధ మొదవె నలుదిక్కులకున్.

క. శ్రీవిభుఁడు భక్తకరలీ, లావిస్ఫురమర వీజ్యమాన లామజ్జక రా
జీవృత వీజన ధావ, ద్దావానలగరళఖర్వ తపనుండయ్యెన్.

మ. అమృదూష్ణంబు సమర్పితాన్నము మరీచాయుక్తముల్ శాకముల్
సమలావణ్యవిదూరముల్ బడిదెముల్ పౌరాపణానీత మా
జ్యము నిర్మాధురికంబు పాయసము ఘసృం బర్కలంఘ్యం బసా
ఖ్యము నీ వేగతి నారగించెదో కదా కాచేలధానాపహా.

సీ. మారీచవైరికి మారీచమహితశాకానీక మిది ప్రియం బౌనో కానో
ధేనుకాహితునకు ధేనుకామితపయఃపానసౌఖ్యము హితం బౌనో కానో
మధువిభేదునునకు మధురసాస్వాదనాహ్లాదనం బిది మతం బౌనో కాదో
హంసవిద్వేషికి హంసోదకిని సేవనాభిముఖ్యం బిష్టమౌనో కాదో

గీ. యెఱుఁగము గదయ్య తప్పు సహింపుమనుచు, వేవిధంబుల భయభక్తి విన్నవించు

జనకభూభర్త సరసోపచారభణితి, నాదిభణితాయి నవ్వుచు నారగించె.

క. సలవణమై సహజంభల, ఫలజలమై యేలకావిభవసురభిళమై
విలసత్కైడర్యపరీ, మళమిళితంబైననీరుమజ్జిగఁ ద్రావెన్.

క. అజ్జారే కజ్జాయము, మజ్జారే బజ్జి నీరుమజ్జిగ భళి లా
మజ్జకసౌరభ మజ్జల, గజ్జల మయ్యారె యనిరి కౌశికముఖ్యుల్.

సీ. కడియెత్తుచునె క్రోలఁగాఁదయ్య పానీయ మీవేఁడి చేరింత త్రాగరాదె
మొదలనుండియు శాకముల నేటి యలవాటు కమ్మని పప్పింత కలపరాదె
చెప్పరా దని కూర చప్పరింపఁగ నేల యప్పళంబుల చవి యానరాదె
పిండి వంటల పిండిఁ బెట్టనేటికి ఘృతప్లుతభక్తకబళముల్ గొనఁగరాదె

గీ. బజ్జి భుజియింపుఁ డల్లంపుఁబచ్చడులకు, పెరుఁగుకూడిగురుంగూర వరుగులేల
నరుగు నన్నంబు వరుగంచు ననిలమంచు, నించువేడుకభుజియించి రెల్లమునులు.

గీ. అనఁటిగెల నుండి పండి తనంతఁదానె, యవసి రాలిన రసదాళి యువలిపంపఁ
బుటికలనొలంది నవసుధాఘుటికలనుచు, గుటుకుగుటుకున మ్రింగె సజ్జనికులంబు.

శా. శాల్యన్నంబే మురువంచు వంచుకొను చంచద్విభ్రమభ్రూలతల్
జార్గొప్పం గొరకొప్పు చొప్పడరు నల్లంజిల్వచెల్వంబు నా
గార్గోముల్ వలికమ్మవాతెఱల తీయంబొండ్లు మేలూరుఁబిం
డ్లూర్గాయల్ జనపర్ణభాజనములం దొప్పార నర్పింపఁగన్.

సీ. మెత్తనై తావులు హత్తి యావులువారు తీఁగిమల్లెల సన్నయోగిరంబు
కమ్మనై నవనీతగతి నేకపాకమై పేరిన నెయివంటి పెసరపప్పు
చొక్కమై సరిగాక శోభిల్లు మృగనాభికాఘుమంఘుమల సద్యోఘృతంబు
తెల్లనై శరదాగమోల్లసత్కల్హారవల్లభప్రభ లుల్లసిల్లు పెరుఁగు

గీ. జంభరసగుంభితార్ద్రిక శకలములును, సర్షపామ్రాదికోపదంశకశతంబు
నంచుకొంచు నొకించుక దించబోక, లోపలికిదించె తాపసద్విపిచయము.

సీ. నారదుం డీజీవనంబు శ్లాఘించునే పాలివి చాల్ మందపాలమునికి
నీపుట్టతేనియ యింపె వాల్మీకికి మెప్పించునె మరీచి మిరెపురసము
నేడూరుఁగాయ శాండిల్యమౌనికి నెంత యగిశాకుచా రగస్త్యఋషికరుచె
బాదరాయని రేఁగుపండ్లపచ్చడి మెచ్చు ముద్గలుం డీసూపములు గణింపఁ

గీ. డనుచు జనకుండు సరసోక్తు లాడుకొనుచు, నుపచరింపఁగఁగలనైన నొక్కమెతుకు
గుఱుతెఱుంగని జటిలోకకోటి నగుచు, దృప్తివహియించి గట్టున ద్రేన్చె నపుడు.

క. ఆఱుదువగల చారు, ల్నాలువిధంబులరసావళుల్ వేయుపహుల్
కూరలు బచ్చళ్ళూర్బ్బం, డ్లూరుంగాయలకు లెక్కయున్ మఱికలదే.

క. లెక్కలుపెట్టఁగ వచ్చుం, జుక్కలఁ దద్భక్ష్యభోజ్యచోష్యాదుల క
మ్మక్క మఱి లెక్క యెక్కడి, దక్కడి యొక్కొక్కకడి వెయాఱులు సేయున్

శా. అన్నా యొక్కొకపత్రభాజనముచాయాం బోరివగుం జక్కెరల్
తిన్నెల్ సద్ఘయపూపముల్ వఱదలై దీకొన్న యాజ్యంబులున్
మున్నీరై ప్రవహించు తేనెలు ఫలంపుంగుంపులున్ దిప్పలై
జున్నుల్ కాల్వలుగట్టినట్టిదధి రాసుల్ గొన్నయన్నంబులున్.

గీ. యాదవస్వామిఁ గూడి గంధోదకములఁ, జేతులకు వార్చ్చి నిర్మలచేతులకును
మునుల కొక సౌధవీథిఁ దాంబూల చేల, జాలము లొసంగి బహుళాశ్వ జనకనృపతి.

మ. ఘనవత్సున్ మణిపీఠ నుంచి శయశంఖుం బేలు పన్నీట నా
టినపాటీరము మేన మెత్తి మెయిరెంటెంబుం బదార్వన్నెరే
కునుంను పళ్ళుహరాకునూకు తెలనాకుల్ నిక్కు పేరుక్కుచ
క్కని కెంపుం గరుణింపు కెంపు వగ బాగాలుం సమర్పించుచున్.

క. మంజుల మణి మౌక్తిక బల, భంజన రత్నాచ్ఛ గుచ్ఛభర్మపరిసవా
రంజన్నవనసనాగీ, కుంజరపట్టుపటి విధునకున్ గట్టించెన్.

క. తొగరావారి బావకుఁ బ, న్నగరాట్కోటీరసఖుఁడు నలుగోటులకున్
జగరాజు తెలుఁగనమ్మిన, మగరాపతకంబు జనకమహీపతి యొసఁగెన్.

శా. కొంచెంబా సదనిబ్బరంబు కడమా కుందరింబెముల్లోకముల్
మించెన్ దీని బలారిలాయమున నేలోకాన నేరాణువం
బంచారించిన యట్టి వారువము చెప్పన్ వింటిమే యంచు ము
న్నెంచన్ రాజిలు తేజి గంధకరిఁ గానిక్కిచ్చెన్ మురారాతికిన్.

క. ఆతఁడి దైతేయారికి, నాతం డడ్డపడి లేచి హరిచరణసరో
జాతము శిరమున నురమునఁ, బ్రీతిం గీలించి మధురరీతింబల్కెన్.

ఉ. యాదవసార్వభౌమ సదయా వసుదేవసుధాబ్ధిపూర్ణచం
ద్రోదయ చక్రి శౌరి పురుషోత్తమ హ్యుత్తమ ముత్తరించు నీ
పాదముఁగంటిఁ గంటి మునుపంటితపఃఫల మెమ్మెయిన్ ద్విదీ
యాదర మిట్టి దంచుఁ గలనైన నెఱుంగుదునా జనార్దనా.

ఉ. అంబుజనాభ త్వావకపదాంబురుహంబుఁ దలంపఁ జాల దెం

దంబునఁ బ్రీత్యహంబు గగనంబును జూచెద నీదుపాదపా
దం బొక చిన్న మెత్తుఁ గొనుటజ్ఞుఁడఁ గాన భగీరథప్రియఁ
త్నంబుగ నెంతు నేమిఁ గని దాసునిఁ జేసితి దానవాంతకా.

ఉ. ఎక్కడుగాదె ద్వారవతి యెక్కడ హా మిథిలాపురంబు నేఁ
డెక్కడ సామివార లిటు నింటికి వచ్చుట యెంటి నేడ నే
వెఱ్ఱికిఁ దినో తలంచితినొ కొత్త లకారణబంధుఁడౌట నే
డిక్కడఁ గానవచ్చె సమదేభమనోభయభారభంజనా.

ఉ. సన్మునికోటి కెన్నఁడుఁ బ్రసన్నుఁడుగాఁడు విదేహమేదినీ
భృన్మణి యింటికై యరిగి పెట్టెడు నన్నముపట్టెదుర్ భుజిం
చె న్మధుసూదనుం డనఁ బ్రసిద్ధి గణించితిఁ జాలుఁ జాలు నా
జన్మము ధన్యమయ్యె నిమిసంతతి పావనమయ్యె మాధవా.

సీ. ఒకయింతగుడిసెలో నొదుగుట యొప్పెఁగా నలజగత్పరిపూర్ణుఁడైనతండ్రి
యడుగుదోసెఁడునీటఁ గడుగుట కలదెఁగా మిన్నేఱుఁ బదమున గన్నప్రోడ
త్రావి చేరెఁడుపాలఁ దనిసెఁగా నిల పాలమున్నీటిలో నోల గన్నమేటి
యిచ్చిన యొక్కసా మ్మైదఁ బూని మెచ్చెఁగా సిరికిఁగాఁపురమైన యురమువాఁడు

గీ. భక్తియే కారణముగదా భక్తులిడ్డ, యొక్కతులసీదళంబున నుత్సహించి
భుక్తిముక్తులు దయసేయు పుణ్యమణికి, జగతి ననిపించితివి పుణ్యజనశరణ్య.

వ. అనిబహుప్రకారంబులం బ్రణుతించి యాదిఫణిశాయియైన యప్పరమపురుషుండు దాశరథియై త్రేతాయుగంబున సీతాశాతోదరిం బెండ్లియై మదీయగోత్రంబు పవిత్రంబు చేసిన చరిత్రంబు తెలుంగు మీరెఱుంగుదురు వినంగోరెద నానతీయవలయు నన్న విశ్వంభరుసన్నిధి విశ్వామిత్రుండు బహులాశ్వవిశ్వంభరాభర్తకు కిట్లనిచెప్పం దొడంగె.

ఉ. నందకపాణి దైవతగణంబులఁ బ్రోచుటకై దయన్ దశ
స్యందననందనుండయి నిశాచరి నొంచి మదీయయాగ మిం
పొంద సముద్ధరించి మునియుత్పలలోచన శాపమోచనా
స్పందన చేసి యీశ్వరుని చాపము ద్రుంచి ప్రతాపశాలియై.

చ. జనకు ననుజ్ఞ నప్పుడు బిసప్రసరోల్లస దంశుమత్పలా
త్కనకపతాకికా మరకత స్ఫుట తోరణ దర్పణార్పణా
ప్వనమురుఘంటికా చమరవాల విశాల వితానహల్ల నూ

తన నుతిఁ గాంచెఁ బట్టనము దంతురపట్టపటీపటిష్ఠమై.

ఉ. సన్నమువూసి చిత్తరువుచూపి పటోత్కటకాయమానముల్
వన్నెగ వైచి మంచివిరవాదులు గట్టి ఫలాంశుమత్ఫలా
భ్యున్నతి నిల్పి తోరణములుంచి సహాటకశాటికాచ్ఛటా
చ్ఛన్నవితానసంపద లొసంగిన రాజ్యభవనంబు భాసిలెన్.

క. జనకుఁడు రాముని జననీ, జనకుల రప్పించి స్వర్ణసౌధంబులయం
దునిచి మునిగేస్తునిం జే, సిన మేటిం బెండ్లికొడుకుఁ జేయుండనన్.

శా. వేశ్మాగ్రిమణి జేర్చవాసవమణీవేదీధరిత్రిన్ సుధా
రశ్మిగ్రావసమగ్రపీఠమునకున్ రప్పించి తాముర్వడా
యశ్మప్రాణవదాన్యతాపదసదోర్వ్యద్రిణు రాష్ట్రోలికిం
గాశ్మీరంపునలుంగు వెట్టిరట రాకాచంద్రబింబాననల్.

చ. కవజవరాండ్రు గా నొకతెగా యనిపించిన ముక్తకంఠిచే
నవ తొకయింత వత్తుమను సామజయానల యానవాబ్జముల్
ధవళరుచుల్ గనం దమకు దైవతయావలి మీదుజోడు వా
ధవళము వాడి రిష్టలు సుధాకరబింబముఖీశిఖామణుల్

మ. తనుసుందాయితుచే రెడల్చి కచబంధంబూడ్చి యుర్వియి వా
కలనత్ దీరిచి తావినూనెఁ బ్రసృతిన్ హత్తించి చేనొత్తి కుం
తలముల్ గూడఁగ దువ్వి కౌనుఁ గుచముల్ ధమ్మిల్ల మల్లాఁడఁగాఁ
దలయంటెన్ గలకంఠి యొక్కతె జనస్థానాసురధ్వంసికిన్.

క. ఇందుముఖి వల్పుటటకలి యిడెగొను నొకతె
తిలకవతి యొార్తు పన్నీట జలకమార్చె
సుదతి మృదుశాటిఁ బన్నెరుల్ చుట్టెనొకతె
సిక యొకతె పైచి శిరసార్చె క్షితిపమణికి.

సీ. దరహాస సంపెంగ దండ చుట్టెడుచోటఁ గొజాదివిరిలేని కొఱఁత దూర్చె
బల్లవారుణ పాణిఁ బాటీర మలఁదుచోఁ గుంకుమ లేదనుకొదవఁ దీర్చె
నలికులాలోక సొమ్ములు మేనఁ దొడుగుచో నీలము లెక్కని వెగులు దిగిచె
సుమగంధి తాలవృంతమునను విసరుచోఁ దావిపన్నీరని తప్ప ద్రోచెఁ

గీ. జలువ లందిచ్చి సుస్నె కాంచనశరీరి, యురిదిపనిలేని యఱగొర్త యుత్తరించె
నిలువుటద్దంబు మెఱుఁగిని వెలితిఁ బోలెఁ, బ్రవిమలకపోల రఘుకులగ్రామణికిని.

మ. సుముహూర్తం బరుదెంచె నంచు నపుడా శూరాగ్రగణ్యుం డుద
గ్రమదేభాగ్రణి నెక్కి నూతనపతాకాపుండరీకావళుల్
ద్యుమణింబోలిన పంజులుం బగలువత్తుల్ మంచియాకాశబా
ణము వింజామరకోవ్రిపులుం బిరుదులున్ బ్రహ్మాండము న్నిండఁగన్.

క. ఢక్కానినాదభేద హు, డుక్కా పటహచ్ఛటా పటుధ్వనులును సె
న్యక్కాహళికారవములు, దిక్కాండము వ్రక్కలించె ధిక్కారములన్.

మ. నగరిన్ స్వర్ణగరిష్ఠసౌధముల నానాహంసయానామణుల్
మగపుట్టొందిన నిట్టులుండువలదా మమ్మారె యాజానుదో
ర్యుగళం బౌరగళం బయారె యురమూరుద్వంద్వ మమ్మక్క మేల్
నగుమోమన్న కిరీటిపచ్చ మెయి మిన్నా పూర్ణచంద్రాననా.

ఉ. కన్నులయందమా కలువకచ్చుల యెచ్చుల కేమి తమ్మిరే
కన్నులయందమా యెఱుఁగవా మగువా తొగవాటమే సుమీ
నెన్నుదు రంటివా కుముదినీవిటునీవిటు లాఁతి నీడుగా
నెన్నుదురంటివా రఘుకులేంద్రుఁ డుపేంద్రుఁడు వోతలోదరీ.

క. చూచితిమే కద సుమనా, రాచధరాధర ధనుర్ధురంధర బంధు
ద్యోచర వరతనయుల నీ, రాచకొమారునికి సాటిరారు లతాంగి.

మ. కరటిగ్రామణి నెక్కి లక్ష్మణుఁడు వెన్కన్ వీటికాపేటికా
ధరుఁడై వీడె మొసంగ నద్దొర పిఱుందం జామరద్వంద్వ మెం
క్కారుఁ డిర్వంకల వీవఁ దెల్లగొడుగుం గైపొంది కోటీరభా
స్వరుఁడై వచ్చెను రామచంద్రుఁడు దయాసాంద్రుఁడు చంద్రాననా.

సీ. కురులుకూడని నాఁడె యిరులుగ్రాసిన మేని రాకాసి నేసిన రవ్వయితఁడు
రెండవవేల్పుటేఁడుండ వన్నెగఁగూర్తు మనువాని జన్నంబు మనిచె నితఁడు
జడదారి యొయ్యారి పెడదారితీరువో నడుగునెత్తమ్మి దుమ్మిడియె నితఁడు
ముక్కంటి బలువింటి యుక్కంటి విఱిచిన చేబల్మి కల్మిచేఁ జెలఁగె నితఁడు

గీ. దుక్కిలోనుండి మనరాచచిక్కు తేని, యక్కఱఁ బుట్టినట్టి యాయనుఁగుఁబట్టిఁ
బెండ్లియాడఁగ నేతెంచు పిన్న యితఁడు, చూడఁగదరమ్మ కన్నుల వాఁడు దీఱ.

శా. అంగం బంట మనోజుఁ డేసె భవదీయాంకంబు వీక్షించు సా
రంగాక్షీమణి నన్నుఁ ద్ర్యంబకధనుర్భంగంబుఁ గావించి తా
భగింజెప్పకుభానువంశతిలకా పంచాంబకాంచద్ఘను

ర్వంగిం బింతుక చేసినప్పుడుగదా బాహాబలం బేర్పడున్.

ఉ. కంటికి విందవైతి తెలిగంటికిఁగుంటికి బాసయిచ్చు నీ
వింటికి నారినైన మనసిత్తువుగా యది గూడ జేని నీ
వింటికి నారినైనఁ గొదవీడదె మంచిగుణం బటంచుఁ జే
కొంటి భుచోద్యమే కరముఁ గొప్పునఁ గూతురవుగా రఘూద్వహా.

చ. అసమకృశాంగి యోతురా విరు లముట్టుచుఁ బూసరు లెత్తి రాము సాం
పొసఁగఁగఁ జూచి యిట్టు లనె నోయి రఘూద్వహా నీవు నన్నుఁ
డొసపరి కౌఁగిటం గలయకుండిన నీకుడిపువ్వులేనువిూ
ప్రసవశరాంబకంబులయి బాములఁ బెట్టెడు నన్ను కైపడిన్.

ఉ. రామునిఁ జూచి కామునిశరంబుల గాసిలి చేష్ట దక్కి కాం
తామణి యుండె నోతురా రఘునందనపాదరజంబుచేత ముం
గోమలిరేఖ రాతి కొనఁగూడెనొ లేదొ యటంచు నెంచి లీ
లామహితాంగ మొందఁగ శిలామయరూపముఁ బాల్చెనో యనన్.

ఉ. అంచు వధూటు లెల్లఁ బురి హట్టములం గన దేవతాతతుల్
కాంచనగర్భ దిక్పతి నికాయ శుకాదులు పాదచారులై
యంచల నేగు పేటఁ బురి యంచులకేగి హజార మోరకే
తెంచి రఘూద్వహుండు బలదిగ్గజ మక్కటి డిగ్గె డిగ్గినన్.

ఉ. వాకిట వాకిటన్ విబుధవర్గ కరార్పిత పూర్ణకుంభముల్
కోకపయోధరల్ మణులఁ గూర్చిన యారతి పళ్లెరంబులున్
శ్రీకరదర్పణంబులును జెల్వుగఁ గాంచి గృహంబు సొచ్చి యి
క్ష్వాకుకులాగ్రగణ్యుఁడు వివాహ వితర్దికఁ జేరెనంతటన్.

సీ. జలకమార్చి మెఱుంగుటలకల తడియొత్తి కొనబు పాపటఁ దీర్చి కొ... 
మొంగలి రేకులు చెక్కి మొగడ సంపఁగి దండ యుద్దండశృంగార ... నొ...
శోభిత మృగనాభి నాభినాభముఁ దీర్చి చొక్కంపుమణుల చేర్చుక్కఁ ...
కుంకుమ పంకంబుఁ బొంకంబుగ నలంది కమనీయహార మొక్కటి ఘటించి
అవిక హసశించి నెరుక యేర్పడిన చంద్రికాపైఁ గాంచికా దామకంబుదచ్చి
కోటి చేసిన యొక తులాకోటి మొరయ, సఖులు దెచ్చిరి సతిఁ బెండ్లి చవికె కడకు.

క. ఆకల్యాణంబున గా, రీకల్యాణంబుల రఘుహరిం బొగడిరి నా
నాకల్యాణులు కోకిల, కాకల్యాణపదకంఠకూజనధ్వనులన్.

క. అక్కళ్యాశాలి పెండ్లి నాఁడొక్కలాగు, వక్కలాకులె యక్కటా శాక్కలాప
కబరికాధర గతరాగ గల్ల భాగ, ధిగధిగద్ధిగధీతితి ధిక్కరించు.

క. ధనువింత దునిమిధరణీ, తనయాగ్రిణిఁ బెండ్లియాడెదను నేననిము
న్నను గంకణంబుఁ గట్టిన, ఘనుకరమునఁ గంకణంబుఁ గట్టిరి విప్రుల్.

క. కుంతీభూతేతరకల, కంఠీకల కంతగళము కల్హారవనీ
కుంఠీకృద్విభుమలరా, ట్కంఠీరవమపుడు తాళిఁగట్టెన్ హాళిన్

క. జలజాక్షి పసిఁడి గిండిం, జలములు వర్షింప జనకజనపతి రఘురా
ట్కుల మణికేలొగ్గఁగవి, ప్రులు నేర్పవమంత్రి తంత్రములుపచరింపన్

క. ధారాధరకన్యామణి, ధారన్ ధాయణిఁ జెలంగు తనదుతనూజన్
ధారాధరధమ్మిల్లన్, ధారాదత్తంబు చేసి ధన్యుం డయ్యెన్.

క. అల కీల్జడ యిలదేల్చడ, మలఁ గీల్కొనఁజక్కనిక్కి మపవతి కనుపా
పల డాలెత్తిప్పల నూల్కొనఁ, దలఁబ్రాల్ వోసెన్ నృపాల దర్పకుహాళిన్.

ఉ. హోమకృశానుధూమమున కోరఁగఁ జేసిన గోను మోము చే
రాముఁడు చూచె సీతయధరంబు పయోధర మాదరంబు నే
రాముని బంధుజీవసుమ మచ్చటఁ బిండియఁ గన్నయట్లు చిం
తామణి గన్నరీతిఁ దనదండన మేరువు గన్నకైవడిన్.

ఉ. ఇంచటి మించి పల్కెడు మనీషి వెసో యువి మావి దక్షిణల్
ముందువిడెంబు మాది యొక ముక్కయు రాదట నీవుసన్మతిన్ వే
యందఱు శుద్ధశుంఠ యితఁడందురు మిమ్మనుచున్ వితాశతా
నంద వసిష్ఠ శిష్యుల కనంతకచాకచి యయ్యెనయ్యెడన్.

మ. పరమేష్ఠిప్రముఖుల్ త్వదీయపదసంస్పర్శంబుఁ గావింపఁ బ్రి
స్తరమే దుర్లభ మింతియైన నిపుడో ధర్మాత్మ యంచున్ న్నగన్
దురితోత్పాటనమైన కేల సనికల్ ద్రొక్కించె నక్కామినీ
చరణాంభోరుహ మంగుటంబుఁగొని కౌసల్యాసుతుం డంతటన్.

శా. కళ్యాణావాము లీప్సితాన్నఘృత లోకంబుల్ ప్రవర్తిల్లినం
గళ్యాణాంబర చేటికాశ్వగజ సంఘం బిచ్చి శాపాన్వితా
హల్యాకల్యవతార భేదనపాదాంభోజుఁ గళ్యాణియా
కుల్యారత్నముఁ బుత్రికన్ జనకుఁ డేగుం బెండ్లి నాఁడంపినన్.

క. ఆరేయి రూపరేఖా, ధారేయి మెఱుంగు వంటి ధారేయుంబల్

దేవుఁడు గానఁ గొంత కడతేఱె మనోభవుధాక కన్యఁడే.

ఉ. భూరమణుండు కోమలికిఁ బొంచుచు గండవరంబుపైఁ బ్రియా
భారముఁ జూపి తానొడలిపై విహరించెను గాంచి మీదటం
గైరహి చేరి చెంగనలి కావనకాండము సొంపుమీఱు చే
రూప గ్రహించెఁ బోరసిలె నుద్ధతి నవ్వలరాచవీటికిన్

క. కామిని సీతాభామిని, సామినిమీలితదృగంబుజాతను గా నా
సామి నిమిషంబులోన, యామినిఁ జొక్కించె దర్పకాహవభూమిన్

సీ. గాఢోపగూహనసక్తాస్యపద్మనూవల్లి వివిధాస్యవీటికావినిమయంబు
సన్యస్తమక్షశిఖాకాంక్షితంబు కచభరగ్రహగళద్విచికలంబు
రదనచ్ఛదచ్ఛిదారోపరిలసనపట్టి నఖరత్రుటద్గల్లనసహాదృష్టి
బంధసంబంధవైభవవిభవాలనవృత్తి బహునయానునయపుంభావభూతి

గీ. భూరిమరోత్కలికృతభుజాభుజివిరాజి, సౌఖ్యపరిణామకుచకుంభశయనసముదయ
నందితాననసౌరభ్య మిందువదన, నుదనకదనంబు మహిభర్త మదిఁ గరంచె.

క. ఈరీతిఁ బెనంగిరితా, మారాతిని నాతియుం బురారాతిధను
ర్ధారియు నంత నయోధ్యకు, నారాజిర్వరను జనకుఁ డంపెం బ్రేమన్.

శా. సీతారాముల మాళవిభరతులన్ శ్రీయూర్మిళన్ లక్ష్మణున్
ధూతాఘున్ శత్రువికీర్తి కీర్తినిధి శత్రుఘ్నుం దశస్యందనుం
డీతానందముతోఁ గొడుకొని పోయెన్ నాడయోధ్యోర్వీకం
చాతం డీకతఁ జెప్పియజ్ఞవరునికి హర్షంబు నొందించినన్.

మ. రఘువంశంబునఁ బుట్టి యధ్వరము సంరక్షించి మౌనీంద్ర స
త్యఘనుం గాలిచి విల్లుఁ ద్రుంచి మహిజం బ్రోపించి తాతోక్తిఁ జెం
ది ఘనారణ్యముఁ బొంది యందు ఘన విద్వేషిక్షతి న్నాఁడయో
ధ్య ఘటోద్యోగమునఁగూడి రాజ్యసుఖివౌ నారాజవీవేహరీ.

క. ఈవిందుండిన మనకే, యీవిందులటన్న నతని యింట వెలందుల్
తావిందు లారగింపుచు, గోవిందుం డందునుండెఁ గొన్నిదినంబుల్.

క. ఈరీతి జనకు నింటను, శౌరాతి దయన్ వసించి యంతట నొకనాఁ
డారాజొడఁబడకున్నం, ద్వారక కేగుటకుఁ బ్రార్థనల నొడఁబఱచెన్.

శా. అద్వైత్యాంతకుఁ డిత్తెఱంగ శ్రితదేవాస్యంబు కన్గొంట పా
సావోర్వీం ద్విజనాళిచేఁ బ్రసవపూజల్గంట విప్రస్తుతుల్

మోదంబందఁగ విందు భోజనములం బూర్ణాత్మ సంతుష్టి నుం
టూదారి నుర్వరదారి ద్వారకకు దా నానుజ్ఞ గైకొంటయున్.

క. దైత్యారి యపుడు జనకున, కత్యాదరలీల వాంఛితార్థప్రదుఁడై
సత్యాసత్యాది కళా, వత్యావృత్యాప్తిఁ బురము వాడల వెడలెన్.

సీ. ఈరామ కతనఁ గాదే శౌరి జాంబూనదంబు వర్షించు రత్నంబుఁ గనియె
నీ భామ కతనఁ గాదే భూధరోద్ధర్త నరకాసురజయంబు నాఁడుగొనియె
నీ వామ కతనఁ గాదే చక్రి పారిజాత ప్రపాటన నటత్ప్రణుతిఁ గనియె
నీ లేమ కతనఁ గాదే మురారాతి రుక్మిణిచేత నిజము వల్కించుకొనియె
రామ యీరామఁ గన్న యా రాజమౌళి, భాగ్యమే భాగ్య మబ్జాక్షి బ్రతుకె బ్రతుకు
మఱి యశోదా కృశోదరీ మణికిశోర, సార్వభౌమాభిరామ యీసత్యభామ.

వ. అంచుం బౌరలోకానీకం బవలోకింప.

సీ. నునుసొంపుఁ గనుచెంప పని క్రొంజికిలి ద్రొక్కు నిడుదయొంటులనిగ్గు టడుగుజాఱ
సిగమొగ్గ సంపంగి చెందిరపు రవలు జిగి యొంట్లకడ కెంపు సిరులు నింప
డావంకఁ గళలు గట్టని యంగి పైతాళి నెఱకెంపు కుంకుమ నీరు చల్ల
నిజకటీతటిఁ జెక్కు నీలంపుఁ బిడిబాకు కనకశాటిక గుల్ల కావి గట్ట
క్రొత్తలాతంపు గొరజి తాకుల నొకింత
కణుకణుగుమంచు రానేల బణుకసణుగు
కణుఁగుసాంబ్రాణి కంఖాణిగతికిఁ జొక్కి
యెక్కిచనుదెంచు చక్రికి నెదుట మ్రొక్కి.

సీ. ముద్దికాయలనాఁడె మద్దివ్రాలఁగ నులూఖలము లాగినబలిష్ఠకాఁ డితండు
తనమామ డవిణ యిచ్చిన యట్టి పట్టంపుఁ జెట్టిఁ గొట్టిన జగజెట్టి యితఁడు
కట్టల్కఁ జదలేటి పట్టిపైఁ దనచుట్టుఁ గత్తి యెత్తిన శౌర్యఘనుఁ డితండు
రాణివాసపుఁ బోరు రారాపునకు వేల్పు చెట్టుఁ దెచ్చిన జయశీలుఁ డితఁడు
శకట కైటభ ముర జరాసంధ సాల్వ, ఖర తృణావర్త బక మధు కంస హంస
బాణ శిశుపాలక వ్యాళ భంగశృంగ, నిజభుజార్గళుఁ డితఁడంచు నీటుగనుచు.

శా. రాధానాథ వధూటు లీవు నిటకున్ రాఁగా జనాళీ జరా
బాధల్ మానెను వ్యాధులెల్ల నడఁగెన్ దారిద్ర్యముం బాసె ఘో
రాఘుల్ క్రుంగెను బంగులుం బరువు డాయం జొచ్చి రంచు నుర్వరా
జీధీరాగ్రణికిం బ్రజావ్రజము జేజే వెట్టి హాట్టంబునన్.

మ. అపు డాపట్టనభూమి వెల్వడి శుకవ్యాసాత్రిమైత్రేయక
శ్యపశాకల్యపరాశరచ్యవనవిశ్వామిత్రుల న్నిల్పి జా
నపదక్షోణులు దాఁటి జోఁటిగమి వెంటన్ రా శతాంగాశ్వహ
స్తి పదాభ్యున్నతి శౌరి ద్వారక ప్రవేశించెం బ్రమోదంబునన్.

మ. బహుళాశ్వక్షితిదేవు లాశ్రితఘృణాపాంగుల్ వినీలాంగు న
త్తుహినాహార్యతనూభవాసవన సంతుష్టాంతరంగున్ మహీ
మహిళాభర్తఁ జగత్త్రయాంబుజవనీమార్తాండుఁ గీర్తించుచున్
మహితానందముఁ జెందిరచ్యుతకథామాధుర్యధుర్యాత్ములై.

ఉ. అందలిరాజు భాగవతుఁ డౌటను జేసి పురంబులోని వా
రందఱుఁ బుణ్యులందఱుఁ గృతార్థులు భాగవతోత్తముల్ వణి
జ్నందనుఁడౌ కళానిధిగుణంబులు కానివిచిత్రచిత్రమై చి గో
విందునిచేత మెచ్చుఁగొని వీరల నిద్దఱిమించె నిద్ధరన్.

వ. అనిన మునిసార్వభౌమునిం గనుంగొని పరీక్షిదపనీరక్షి వణిగన్వయపయోనిధి
నిధి కళానిధి కథావిధానంబు సవిస్తరం బానతీయనే యని యడుగుటయును.

శా. తుష్టాశాదిహయాధిరోహణకళాదోర్భరత్న తుష్టిచనా
మష్టాధిల్లి వెలందకోట హయువిా మాహీప్రతీ మాహురీ
దిష్టిండేందునిటాలకాకుచనుటిదేశార్ద్రికాశీశ్వర స
మ్యష్టాభాస్వన్నృపతిప్రతాపతపనీయాహార్యధైర్యోదయా.

పృథ్వి. సగంధగజసైంధవాసముసమగ్రనీతిక్రియా
యుగంధరధరాధురాయుతభుజాగ్రజాగ్రత్ప్రథా
యుగంధర వారాశిభూహుతభుగర్చిరుచ్చైర్మహో
దిగంధతమసప్యశస్త్రిమితసుత్తధాత్రీధవా.

గద్య. ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్రకరుణానుగ్రహశాశ్వతైశ్వర్య ధుర్యతామ
హేశ్వర రూపరేఖావిజితరతీశ్వర సరససంగీతసాహిత్యసకలకలావిచక్షణ సమాశ్రితవి
ద్వత్కవిరక్షణపక్షపక్షణ యనిగెలగోత్రపావన పరిపంథిరాజకల్పితపాదసేవన దామర
ల వేంకటాధీశపుత్త్ర చెన్నభూపాలకకలితసౌభాగ్రతగురువమాంబాగర్భశుక్తిముక్తాఫల
గురువనజసంభవభవశేషభాషాపాణీపాబల ప్రతిదివాగతార్థి జనవరప్రదాయక శ్రీవేంగళ
నాయకప్రణీతంబైన బహుళాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునం చతుర్థాశ్వాసము.



శ్రీరస్తు.

# బహుళాశ్వచరిత్రము.

## పంచమాశ్వాసము.

క. శ్రీమహిళామహిళాలాభద, యామహితాంభోజనాభ యతిలలితసుధా
ధామోదిత శ్రీహరిసే, వామోదితవేంకటేంద్ర వైభవసాంద్రా.

వ. అవధరింపు మయ్యుత్తరాతనూభవునకు బాదరాయణి యవ్వల కథావిధానంబు విని
పింపం దొడంగె.

సీ. ఆమిథిలాపురియందు రత్నాకరుఁ డను వైశ్యుఁ డొకఁడు ప్రియమిత్రాఖ్య
తనయుఁ డాతనికళత్రంబు భాగీరథి కొడుకు కళానిధి కూర్మితనయ
కమల సత్కమలాక్షిఁ గళ్యాణమొనరించె గోవిందుఁ డనియెడు గుణనిధికిని
గోమయనకును జతుకూఁతుఁ బెండ్లి యొనర్చె రోహిణియను వరారోహ నతఁడు
తనకుఁ జుట్టంబు పక్కంబు తల్లిదండ్రు, లన్నదమ్ములు మనుమలు నాలు బిడ్డ
లెల్ల నిల్లుండ్రు నిల్లండ్రు నుల్లసిల్ల, ననిశముఁ గుబేరసంపద నతిశయిల్లు.

గీ. ద్వాదశి నమాస సంక్రాంతితతిని గ్రహణ, మప్పుడర్ధోదయమహోదయములనొక్క
కాసు భూసురునకు నీఁడుగాని గడనఁ, గోరు ధనవంతుఁ డయ్యును యవ్వారజుండు.

క. ఆదాయమునకుఁ దగిననె, లేదాయెన్ వెచ్చ మంతలేదాయెనెమా
టాదాయోదనిధియను, లేదాయ గదయ్య యక్కటినచిత్తునకున్.

ఉ. కట్టఁడు యోగ్యశాటిఁ బొడకట్టఁడు రాచనగళ్లకుం జెవిం
బెట్టఁడు కీర్తి తారమిడి పేర్కొనుచోనరకాసు బేరమం
బెట్టఁడు ధర్మచింత సరిపెట్టఁడు గట్టిమనంబు దిట్టడ
క్కట్టిడివైశ్యుఁ డన్యుల కగణ్యముగాఁగఁ గణించె రొక్కమున్.

చ. దిన మొక కూర గాని మఱి తేఁకుఁడు శాకములంచుఁ బల్కవం
డిన పలు కూరఁ గాంచి జగడింపఁగఁ జొచ్చు నటంచు వాని నొం
టిన భుజియింపఁ బెట్టి కడ నిచ్చు భుజించెద రింటివార ల
య్యనుపమశాకసూపకలమాన్నఘృతాదుల వాఁ డెఱుంగమిన్.

క. పెసరుంబ ప్పేమిటికని, కసరు న్నెయిగోనఁడు పండుగను గోయకూరే
[illegible]రం బలుచని చల్లయె, మొసరుంగనఁ డతనిలోభమున కేమందున్.

క. పచ్చనియాకుం దానికిఁ, బుచ్చిన గొంటొకటి సమలుఁబో మొలఁబూనం
జెచ్చెమాయునోయని తెలి, పచ్చడ మటుకట్టి యొంటిపంచె నెలితుకన్.

మ. కరఁగుంచాఁ బొరుగమ్మకాన కెదురంగళ్ళం గొనఁబోవ దృ
క్పరసంజ్ఞన్ మరలించి వారలకిడుం గాసెచ్చుగా జేరముల్
తెరవాటిందఱి వీడు వెచ్చమునకున్ లేకున్న నేమాయె ని
ద్దురగా కొయ్యన నంచుఁ బోకయడకొత్తుం జేతికిచ్చున్నడిన్.

మ. పడి కొంపెంబుగ రాచు నుప్పుడులకుం బానీయ మర్పించుఁ ద
క్కిడి గట్టుం దిన మెచ్చు గుండులుగఁ బూసెన్ చేతిలోనూనియున్
మిసమి న్నూనియ నాముదంబుఁ గలపున్ మేలాముదంబందువె
లిగ్గడినించుం గదియించుఁ బ్రాఁదవుడు హాళిం గ్రొత్తబియ్యంబునన్.

క. త్రాఁచేన తప్పు వెట్టెడి, చోఁబాతిక వడ్డిఁగొలుచు సుమడ్డుగకున్
ప్రాఁబిన్నపడిని గాసొక, టిఁబోఁడితఁడుగ వెచ్చమిడుగుదువడుగున్.

క. శాంతుల సొమ్ములు వెలచేఁ, గొంత పడిం గొంత కొలను గొంత హాళాన్
గొంత సారించుఁగువాళపు, దొంతర వైశ్యుఁడు పశ్యతోహరుఁడగున్.

గీ. క్రొత్తతియవాఁడిఁ గని ప్రాఁతరూక యంచుఁ
బ్రాతహాణఁజూచి నాడెంపుఁ బణమటంచు
చాకి మొరయంచు నొరయైన నాగరంబు
ధవళి నెడవెట్టుటంచు వట్టంబుఁదివియు.

క. అరతాన్నకపునకు శృం, గారకళాశాలి తారకాహిత రేఖా
హారికళానిధివృత్తైన్, బారావారమున నమృతభానుఁడుపోలెన్.

ఉ. చంద్రుఁడు కాంతిసంపదల జారువికాసవిలాసరేఖలన్
జంద్రిక తెల్లచోట నెడఁజల్లెడువాఁడు వితీర్ణవైఖరిం
జంద్రకిసాదితంద్రి తల చల్లనిపూవు ప్రసన్నతం గరల్
చంద్రుఁడుఁ డక్కళానిధి కళానిధినామము వానికే తగున్.

సీ. అంభోజరాజహార్యంగదీధితివాఁడు శ్రవణభూషణవిలాసములవాఁడు
విపులచందనపంకహిమకరంబులవాఁడు కస్తూర్యురస్తటాంకంబువాఁడు
ద్విజబుధేంద్రుల కెల్లఁ దెగుదారి యగువాఁడు రేఖాఫలితసముద్రికలవాఁడు
శాపలేనిసిరితోఁ జఁగూడఁబుట్టినవాఁడు గురుశిక్షచే విద్యఁబరఁగువాఁడు
కావ్యభాస్వత్ప్రచయముఁ గన్నవాఁడు, కన్నవారికిఁ జల్లనై యున్నవాఁడు

రోహిణీభర్తరత్నాకరునికుమారు, ధీరునిగళానిధిని వినుతింపఁదగదె.

ఉ. అంతట నొక్కనాఁడు వణిగాత్మజుఁ డంబుజుఁ జూడఁబోవ వా
సంతమహోత్సవంబు మహిజాపరిణేతకు నేఁడు గొంతవీ
క్షింతమటంచు స్వామిగుడికిన్ గడచెన్ గుడిసేవ చూడరా
దింతయు నన్నతండ్రిపలుకిచ్చె నటింపఁగ ముచ్చటించుచున్

ఉ. చేరెఁ గిరాటజూటమణి శ్రీరమణీశనివేశగోపుర
ద్వారము హావచోనుకలితస్వస్పృగధ్వగపూజితానిలా
ధారము సేవనార్థిజనతాపవిపాటికవాటపీఠపా
టీరము నానటత్స్ఫుటకటీరతటీకనటీకుటీరమున్.

ఉ. అక్కడనుండి దేవనిలయంబునకున్ వలచుట్టుచో నహో
పక్కసుమాసవస్రవణపత్త్రమహత్తరశీతలత్వస
మ్యక్కృతవాతచూతరసమంజులవంజులఝాటపాటలీ
భాక్కుటజద్రుమద్యుచరపాదపవర్గగమార్గగామియై.

క. కనియె వణిఙ్మణి పఘ్యో, దనసద్యోష్ఫుతసిత ఫుల్లత్రపతిప్రాపో
ద్యనుపమపరిమళమోదిత, జనజాలవిశాలపాకశాలల్లిలన్.

శా. గ్రావస్తంభపవిత్రపాణ్యశనభుగ్గ్రామీణపర్యంతభూ
వ్యానల్గత్ప్రవగంబు శీర్షగతపూర్ణాపూపపాత్రీధురా
ధావద్ద్రావిడబాడబంబుగణికోద్వల్లీలహల్లీసక
వ్యావృత్తాశయమైన దాశరథిదేవస్థానమీక్షింపఁగన్.

గీ. రండుకోవెలసేవలరాజాముఖులు, రాకయుండిననెఱుఁగుదురే కదయ్య
వచ్చుగుడియధికారి చీవాదుపెట్టు, తమకుబలెనంచవసరంబు తమకుమెఱయ.

సీ. తలగడగాదట్టిదార్చికూర్చెనో లేదో వడిద్రుళ్ళిపడిలేచివెడలు వెలఁది
బారాపదియటంచుఁ జాచికల్ పైచియల్లటుఁ బాళికడఁ ద్రోచియరుగునతివ
తెలియవెట్టినదనఁ దెలియదుపోనిమ్మంచు నామంబు దిద్దుచు నడచునాఁతి
మాటలాటగఁ జూడ మీటుఁ జుట్టుముఁ బిల్వుమనుతల్లిఁ దిట్టుచుఁ జనెడుచాన
పడకయిలుసొచ్చి పిడెంపుమడుపులిచ్చి, మోవిచవిచూపి యెటఁ జన్నమొనలుమోపి
విటునిటుఁబడుమి దేవస్థనటనిగుడికి, నడుగిడుపడంతి యయ్యె నయ్యవసరమున.

గీ. అధరపయోధరలలోన నాథునీధు, రీణవీణాద్యవిద్యాధరీక్ష్మాతాజ
టీసమ సమాఖ్య , గణికపల్లనుబుధసుధాగణికవెలయు.

శ్రీవిశ్రాణన విశ్రుతశ్రవణ మిశ్రీభావశాఖిఖంజనీ
జీవంజీవ సఖీభవన్నయనతాజీవ న్మనోభూభుజా
జీవాతు న్మణిమంజరి న్విటమణీజీవైకసంజీవనిన్.

సీ. అక్కలానిధి మెఱుఁగం బాసక్తిఁ గనుఁగొన్న గనుగవ్వలకుఁ దెల్వి గడలుకొల్పెఁ
జెక్కుటద్దంబుఁ గాంచినఁ జొక్కరక్కొల్పు కనుదమిక్క యరమోడ్పుగానొనర్చె
నోరబయ్యెదచెఱంగొకయింత గనుఁగొన్న మెఱుఁగు చన్గక్కవ మెఱుఁగుచేసె
దయఁజూపు వెన్నెల ల్పయిఁజల్లఁగాఁ జల్లఁ దెచ్చుకోల్తమిఁగొల్పె దృక్చకోరి
నిడుదవెన్నెఱి జడఁజూడఁ గుడికినెడమ, కటునిటును దువ్వికటికిఁ చీఁకటులఁ రాల్చె
నసదృశాదృశ్యమధ్యమ శ్యామ రామ, యల్లవేశ్యాలలామ వైశ్యాగ్రసీమ.

సీ. పెన్నెఱిగుంపుపై భృంగినాట్యము సల్పి చటులదృక్కులమత్స్యపుటము వైచి
వెలఁది నవ్వులమీఁద వెన్నెలాలో యని కలవరాయని నెమ్మొగమునఁ బిల్చి
పాలిండ్లపై మించుబంతులాట ఘటించి యూరుపై యమునా విహార మూని
ప్రోన్నతశ్రోణిపై భూమిక వాటించి తరుణాంఘ్రియుగళి నెత్తమ్ము లాఁడి
విడిచిపోఁజాలవయ్యె నవ్వెలఁది వెలఁది, నందిదండల సంది లేఁజందమామ
కంనువకు నందమని పొంకెఁ గాని యర్య, లోకనముచివిభేదనాలోకనములు.

ఉ. దాని ధగద్ధగిత దర్పణ దర్ప కపోలపాళికిం
దానిసుధావిధామధురతామహితాధరసీధుపీఠికిం
దాని చకచ్చకచ్చపలతాచణలోచనచారురోచికి
న్మానస మిచ్చి మారనిజమార్గణవర్గనికృత్తచిత్తుఁడై.

ఉ. అక్కట యక్కటాక్ష మళి యక్కట చక్కనిమోము సోములో
చుక్కట చొక్కటం బయిన చుక్కట గోఱు మెఱుంగటద్దమౌ
చెక్కట యక్కటారిజిగిచిక్కట కీల్జడ మేను జాళువా
యిక్కట యొక్కటంగొదవె యిక్కటుకంబు పధూటి సాటికిన్.

గీ. ఖంజరీటంబులకు బొమ్మకట్టునయన, కంజరీతి తటిన్మంజిమంజరించు
మంజరీసుకుమార కీమగువసాటి, కుంజరీయాన కీమణి మంజరికిని.

ఉ. లంజలు లేరె యాతల నిలాతల దైవనివాస భూవస
త్కంజముఖీశిఖామణులఁ గన్గొనమో రతిరాద్ధనుర్లతా
శింజిని పుంజి నిట్టు నటుసేయు నిరు ల్నెఱులీనగంటిమా
మంజులవాణియైన మణిమంజరిఁ బోల్గణికావతంసమున్.

గీ. అమ్మనములాడుఁజనుదోయి నిమ్మపండ్లు, బంతులాడుఁ జుమీయన వింతగాదు
బొమ్మరములాడుఁబోయన్నఁ బొసఁగకున్నె, మున్నె దీనిఁగలావతి యన్న నేమి.

గీ. ఒడలిజిగిబిగి కడలి నెన్నడుమఁగట్టు, రానుసేతువె యీరోమ లోమరాజి
కట్టఁదీసిన దరివైచు గట్లు గుబ్బ, లవలఁదిరిగెడుసుడి నాభి యనఁగరాదె.

గీ. అతివకటి భారమై కల్పలతయు నొసఁగఁ, గనిపసిఁడిగట్లఁదులదూఁగి కామినీస్త
నంబు కరికుంభజాతార్పణంబుఁ జేసెఁ, గలిగె హేమాద్రిఁ జూచినందులకు ఫలము.

గీ. ఉదిరిబిళ్ళల తులఁ దూఁగి యువిదగల్ల, తలము ద్విజరాజునకు వసూత్కార మొసంగి
మొగమునకుఁ గానివానిఁగాఁ దగుల మింట, వ్రేలుచున్నాఁడున్యగ్రోధవిటపమంది.

గీ. నంపదరవిందనయన నాంతంబు లైన,
హాసనములతోడ వర్ణసామ్యంబు నొందఁ
దుదిఁ బిసాళించిన లతాంత మది తలంపఁ
దాంతమగుఁ గాని యెంతైన నాంత మగునె.

క. కౌముది హాసము మోవి య, హోమణిసారంబు కువలయానందము కం
దామగాలు గాదె యువతిల, లామప్రసన్నానము కలానిధి గాదే.

ఉ. చిందులు వ్రొక్కనేమనసు చెల్వకుచంబులు తాళము ల్సుమీ
యందలు మెక్కఁబోదురె యొయారినొస ల్శశిరేఖయే సుమీ
యందము లంచుఁ జూతురె లతాంగి కపోలము లద్దము ల్సుమీ
యంపతిడెందము ల్మనుఁగు నాచెలినాభి కొలం కవుంజుమీ.

ఉ. పుత్తడిగట్టు గైకొనినభూరిచయంబున కెండఁద్రోచి యా
యెత్తె సరోజజాలముల నీడిచెఁ బంకములోనికిన్ మదో
న్మత్తములైననాగముల మస్తములై బిరు సింత చూపె నీ
బిత్తరిచన్నులందుఁ గనిపించెఁగదా కఠినంబు లౌటకున్.

ఉ. ముక్కఅపూస యొప్పె సతిమోమునకు న్మటి బొండుమల్లె తూ
పక్కమలారి నాటు క్రియ నన్నెలపక్కలఁ బైన జల్వకు
నక్కొను చంద్రఖండములునాఁ గలువల్చిగురు ల్రుమాలినాఁ
జెక్కులుఁ గన్నులుం బెదవి సిబ్బితినవ్వులుఁ గ్రొవ్వులూరెడిన్.

సీ. సాంద్రకేశములకుఁ జామరంబులు చెల్లుఁ నెలనవ్వులకుఁ బూవు లింత చెల్లుఁ
గమ్మవాతెఱకుఁ జెంగావిపావడ చెల్లుఁ గంఠపీఠికకు శంఖములు చెల్లు
గాత్రదీధితికి బంగారు టెక్కెము చెల్లు నవలగ్నసీమకు తవిణ చెల్లు

జంఘాయుగమునకు సన్నగాళ్లు చెల్లు గోళ్ళకు ముత్యాలకుచ్చు చెల్లఁ
గలిగి కచరుచిలోఁ గొంతగలుగు కాంత, కురులకును దీర్ఘ... చెల్లు
నన్నియంగంబులఁ బ్రవీణ యసమబాణ, సమరసమయాప్తి యీజోటి కగతి మేటి.

సీ. రాహువు గదిసిన హాహాహా యిటఁ బశ్చిమాంగస్థలము...
బరులయుల్లములకుఁ భల్లమై కోసాగి కనుదోయి తలచుట్టు ...
జగజెట్లబలె జాతి చనుగుబ్బగుబ్బలఁ జెఱగొంత భుజమధ్యసీమఁగట్టి
ఘనతరోన్నతికిఁ జక్రమూ పంపుసేయంగ నుల్లసత్కటి ... నొత్తు
బాల్యమూధాధినాథునిఁ బాఱఁబట్టి,
జవ్వనపురాజు సెలవిడ్డ శంబరారి
బలము లాతాఙ్గమ లనంగఁ బంతుమీఱఁ
బొగడవిరిబంతి యీయింతిఁ బొగడఁదరమె.

సీ. కనుఁగొనల్బెళుకుచూచిననాఁటిదృష్టికై పడసివైచినపూవు పంకజంబు
కడుమోముఁ జూచి కనకై సురాళించి కడవైచునెఱిగూడు శౌడపుఁజందు
లలితాంగమిచ్చు కల్యాణంబునకు నివాళించినయారతి మించుఁదీవ
గబ్బిగుబ్బలఁ గన్న గ్రాఁగలకై బలిగొని విడచినకోడి కోకపాక
మేలిసరసహాక్షి సాటి యేయిందువదన, యీడు నేఁడేతటిద్గాత్రి జోడు మఱియు
నేరథాంగిపయోధర యేగణింప, మగువసిగమిన్న యీమణిమంజరికిని.

సీ. కరువుగట్టిన గట్టికటికిచీఁకటి చెక్కితీర్చిన నీలాహి దీనివేణి
కోటికొక్కటి మించుఁ గొని కాంచి చేసిన తీయవిల్తునితూపు దీనిరూపు
మిహిరాంశు గరసాన మెఱఁగుసానలఁబట్టి దిద్దినయద్దంబు దీని మోము
తేఁరాచపేరెండ తేకులు సాగించి తీర్చినవిరిప్రోవు దీనినవ్వు
గట్టిగవ నున్ను బటువు రాఁ గట్టినట్టి, బొమ్మరమ్ములు దీని కుచములు లహహా
చుక్కగమి చక్కఁగాఁ జేర్చి చిక్కటించు, నవ్యహారాళి భళిదీని నఖరపాళి.

సీ. పలుమొగ్గలాణిపాణులచవులనఁగనేల యాలఁతి వజ్రపుమోసు లనఁగరాదె
నెఱికురుల్నెఱనాచు నిడుప్రోవు లననేల యరిది నీలంపుఁబైరనఁగరాదె
జిగివాతెఱ సిరాజి పగడమూ ననునేల నునుమానికపుఁబంటయనఁగరాదె
కోఱనవ్వుకపురంపుఁ గ్రోవి యనా ననునేల గొనబువెన్నెలరాశి యనఁగరాదె
తనువునంపంగిదండ యౌననఁగనేల, యందపుం గుందనపుఁ గోటా రనఁగరాదె
యిబ్బిసరుహాక్షి నాపాలి కబ్బెనేని, యబ్బలవిభేది నగుటయేమబ్బురంబె.

సీ. భ్రమ మొందుటయు కాక భ్రమరము లవి మూలాపత్రాశ్రయోన్నతిఁ బొదలుఁ గాక
మిట్టిపడుటె కాని మీనము లవి మూలాకువలయంబు నవ్వుంగఁ నేర్చియున్న
మొనచూపుటయె కాక యొనరఁగానె విశిఖము లాజిసారంగోదరముఁ బక్షి
బయలు దిరిగ్గుటె కాక ప్రీతియె చకోరము జ్యోత్స్నకావశక్తి జోకఁ గనెదఁ
బాప్రప్తకల్యాణతేజముఁ బంకభావ మలఘు
జాలన్యాప్తేచ్ఛద మనిశప్రసన్నవృత్తి
మెఱుఁగు దఱుఁగమి పఱుఁపగుల్పఱచుటనుది
నాభ్యుదయ మొందుఁ గాంతపృగంతములకు

సీ. అలివేణిచరణద్వయము లాదులకునైన సితవిలోచన నడ సిషికినైన
బింబోష్ఠికటి ధరాభృచ్చయంబునకైన దరకంఠిమధ్యంబు హరికినైన
నున్నతకుచనాభి పున్నాగములకైన వినుతోరు మోము సోమునకునైన
కాహళీజంఘవాక్యము శుకములకునైన బిసరుహాపద నెఱుల్భృంగికైన
నరిదినుతి కంబురికప్రభృత్యరుణమాంస్య, పృథుతరోన్నతికార్శ్యగాంభీర్యకాంతి
మృదులతామేచకద్యుతు లెచ్చఁ దరమె, యితరకోటికి నీజోటి యేటిసాటి.

క. గట్టిఁతగ బుట్టచెండ్లం, గొట్టుట యబ్బురమె కలశకులశైలములం
బిట్టొటుపఱచి నీళ్ళం, గట్టెలు వేయించు దీని కఠినకుచంబుల్.

క. కాఁగెడు గుబ్బచనుంగవ, కాఁగెడువిరితేనెగురియఁగలవాతెఱయుఁ గా
గాఁగెడుకుందనపుందళు, కాఁగెడుమెయి సోయగము లాయారికయాకే.

క. నగరాట్కుచపలుసిరిజిగి, నగరామగఱాల జనులు నగరా మొగముం
దొగరా వగరా వాతెఱ, తొగరా పొగరాను చిగురుతో సరితొగరా.

క. రాజీవానన మరునా, రాజీవాగణికులకును రాజీవారా
పాజీహా బహువిధరతి, పాజీవాదాస్య జీవపజపాజీవా.

క. అనివణిగగ్రిణిసుతమణి, కనలుపటింసేవళమునఁ గాహళిధకా-
సినదహుంధుకా శంఖ, ధ్వనిపటహరవాద్యము రజ నాద్యము లొదవెన్.

మ. అలచట్టుం దలచుట్టుఁగన్నులికిఁ జేయంజాలు రావేల్పుఁగో
వెలచుట్టు న్మునినోవతంసనరణి న్వేంచేయఁగాఁజేసి మం
జులకంజాతవితానమండపనివాసుం జేసి వైఖానసు
ల్తలిఘుల్మీటిన దారగించి మహిజాతానేత శాంతాత్ముఁడై.

సీ. అవసరాపూపికాయాత యోగ్యషోడిగతవైష్ణవశ్రేణికల్పకంబు

వైష్ణవసాష్టాంగపంచనక్షిత్యయుక్ఛందనస్పృహయరాణ్ణింపసంబు
సమవరాణ్ణంవనశృశ్రూపరికరాబ్జదానదక్షకటాక్షధనగణికము
గణికేష్టవాగ్బద్ధకంచుకిక్షితసాటిసాసిపాణ్యాగ్రహీద్ధాధికారి
తదనుచరహుంకృియానిరుత్తరతరప్రి, జాస్తిమిత మైనదశశతస్తంభమండ
పంబునమచక్కఁ జలువచప్పరములోన, జానకీజాని కొలు వున్న సమయమునను.

క. కేళిక కెవ్వతె నవరసా, యాలేమం బిలువు మనిన యధికార్యగ్రో
క్త్రాలబ్ధిలోనె సరసో, నీ_ృలఝుణంఝుణితకింకిణీనిక్వణయై.

సీ. తనకళాచిక మెచ్చి దహళాధినాథుచేతన కళా:కఁగొన్న తలిరుబోఁడి
యంగహారముఁ జూపి యంగాధిపుమనోహరాంగహారముఁ గొన్న •యబ్జవదన
యురుటింత గనిపించి హూణాధ్యుకెంగేలియురటుఁగైకొన్న నీలోత్పలాక్షి
కట్టడల్ప్రకటించి ఘూర్జరుచే నేలికట్టడల్ గైకొన్న కమలగంధి
డవిణముందఱ మెరయు నద్రివిణగాత్రి, వచ్చి ముఖవీణ మురజమావజముపాంగ
మును విపంచియు ఘుమ్మృన , ములరఁ దెరమాటుమైఁ గొంత నిలిచి యఁత

క. సరళఝుణంఝుణనూపుర, చరణగతిస్ఫురణమునకు జనములనునముల్
దరువుగ నిజ రఘువరుపై, దరువొక్కటిఁ గొనియె నెందుఁ దరువుపదలిర్పన్.

క. కడలి తెరవమ్చ్బనచ్చర, కడిమిం జలదంబు పొందుఁగాడని కడఁకన్
విడివడు మెఱుఁగన గవిసెన, యెడసిన యాదర్శమన మహిళ తెర వెడలెన్.

క. కంతుం డోలి యమాడ్చిన మణి, కుంతం బనఁ గుబుస మూడ్చుకుండలికులలో
ట్కాంత యన నింతి భూషణ, కాంతిఁ దళుక్కనియె యవనికానిర్గతయై.

క. బెళకె నటి మఱియు భళి పు, త్తడి తెఱమూర్తీభవించెఁ దధ్యంబనఁగాఁ
గెలకులఁ బట్టిన పంజుల, వెలుఁగులు పుంజీభవించి వెలసె ననంగన్.

క. పుష్పామోద సమాంఘ్రిక, పుష్పాంజలి యిచ్చెఁ బుష్పపుటమునఁ దద్ధ్రు
జ్ఞేష్పాండిత్యము లనుచుం, బుష్పాస్త్రుఁడు వాఱిఁజల్లు పొదితూపులన్.

ఉ. కైయడవుల్గడల్కాలిపి కై మెరయుం దివుటంబుశబ్దమా
రాయన దేసి కట్టడిఁ దిరంబుగఁ బట్టి ధరాధిరాడ్ఘను
ర్గేయునిపైఁ బ్రబంధములు గీతము చేరువచూపి చూడ్క్కక
య్యాయతలోచనాతిలక మప్పుడు ముప్పిరి యొప్పగుప్పగన్.

సీ. లాలించు మైరాగలవారిభోగినిభంగి నోటియుశబ్దము నెలయురుముగరిమఁ
గోపెత్తుఁ దోలుకారుకొ్రిమ్మించు మించునఁ జిరులాగుఁగొనుఁ బుట్టచెండుపగిదిఁ

తిరుకింత గనిపించు మురుభోగ్యస్మరములీల దళసంచువెంచు రథంబునడక
మైసిరిగను మంపమురుజాడ్య దీపమ ట్లుంటుగానము కంచుగంటకరణి
చుఱుకు రవగాలు లయ తాళశుద్ధబుద్ధి, యెదుట రేఖాప్రమాణంబు లుదుటుమనప్ప
నయుభరంబులు ఘూర్ణగన్నటుల కీటుల, మొనప దనిపించె వెలయాలిముద్దుపట్టి.

లయగ్రాహి.

కెంజిగురుమట్టాకు సుదవిం జిరుమవామపదకంజమదనీలమణులం జుఱుకుఁ గెంపుల్
పింజిగోరు గుప్పురిసు సురబాలరుఘుళోంఝుళోలకుం జోరఁ గిరాబ్జమపరంజి చిఱుఁగంట
బ్రంజి గొరు మేఖలపయింజలచి మంజులరశింజితఝణంఝణల ఘ్రంజె గనుపింపన్
లంజెలశిరోమణి యనం దెలఁగు లోకశుకపంజరితహాసమణిమంజరినటింపన్.

వ. అలంతి యలంతిఁ దీర్చికొన సంతవసంతపికానులాపికా
నిలికసూఱిలంగుఁ గోర మరువల్పులకోరగతిం ధురీలున
న్వేలునదేఁ దాళమంటి తననిల్కడకోపు నయంబు రేఖయు
న్వేళ కొమరింపుసొం పొసఁగ బిత్తరిపాదరసంబుకైవడిన్.

చ. తిగుదత తత్త తత్తకిట ధిక్కిటధిక్కిట ధిక్కతోంతఝం
ఝగఝగ ఝుణుక్కుఝుణుక్కు కిణఝుంకిణయంచులతాంగిరంగమం
తగఁజొరఁజాలి కైమొరఁగు సంబుఁగడల్చి పతత్పదోద్ధతి
న్నిగిళీమురఁబ్రెంచుకొన్న రతి నేత్పుమహోగ్రమదావళంబనన్.

సీ. అర్ధాభినయవేళ నంగరేఖాయూధి గల్లకెల్ల విజాతి గానికోపు
వెడకల్లె రసతత్త్వకారంగౌరవముకై మొరయుగ్గడించుచో ముద్దుఁబలుకు
లయగయికొనుచోట లాస్యహావప్రౌఢి యాదిగూడినచోటియందగింపు
జతిదయాత్తినోలుచో జతగన్న పాదలికి తీరుమానముచోట తేటసొలపు
కాంక్షఁగినువారి నీరుగాఁ గరఁచివైచె, నన్నయనాట్యపాటవం బెంచనిమ్ము
పాటలాసూడ యొకపాటఁ బాటపాడ, మాటకిమ్మరో ప్రోటుమాన్ తేటలొత్తె.

సీ. సరణానుచితవాద్యమురజనెట్టెఁగఁజూచు వాల్గొప్పు మరుతూపువాఁడి దప్పఁ
దెత్తెయ్యటంచు ధాత్రికిఁ జూపుపదఘాత మె తన్పిపికుఁడైన నెదకుఁ గోర
పదవాక్యస్వకపూర్వభావాభినయలీలఁ ననుఁబిల్చుటియోగాఁగి కవను లెంచఁ
గదలెనే కదలదో సుదతిపుటాల మేనవ్వురంచుఁ బ్రజచూడ్కి కవ్వఁగెంపఁ
జేటికాశయమాటికాభేదగతిని, లలితతాళావసానోల్లలత్కపోల
భురభ్రజణకణ సౌందర్యకలన కొప్ప, నతనుఁ డత్తన్విన్పత్తాన్వితతఁ జెలంగె.

భుక్తోజ్ఝితసుమాంబరాభరణతాంబూలార్ద్రజిహ్వాంచలా
సక్తాలోకనమేకకాంక్షగవేశ్యాదాసి యేతెంచుచున్.

సీ. ఎదురైన సతిసిబ్బి యీబండిగురివింపయొంటిపే రెంతకుఁ గొంటివాఁగఁ దుఁ
గొసపంటఁ బాటుకునఁ గాటికి యెవ్వతెసాని నెందెపడ్డపాటియేమొత్తగనుసుదు
నాకతెమ్మంగెటఁ గాంచి యుముకవ్వట్టదె తట్టువిరాగోమయం బెండసాగెననుడు
సిగ్గువోయెనెలంతనిలువని దినమెన్ని పంటులు పట్టువిరాయింటికి నుచు
పచ్చవెలబోటిచేటి యవ్వైశ్యనాటి, తెలుపుగలశాటి మక్కుఁ బితీఁగపోను
యెంతవెట్టియు దొరతనంబెఱుఁగదయ్యొ, నెందుజాతిగుణంబువో మందుగలదె.

క. గడవోతుదాసి యుప్పుడం, గడికడకుం డాసి వాసి గడియించుఘునన్
విడఛిపనందనరాకా, నిడధిపుఁగని వచ్చిసట్టి నిజకథఁ దెలుపన్.

క. మిన్నంటి దానిసుద్దికి, మొన్నంటికళావిలాసములు చేకొనుచున్
సన్నుతగాత్రిమొగంపుఁ బ్ర, సన్నత కెదయిచ్చి పేగసారసు మాటిచెన్.

సీ. పసిమిగ్రమ్మెడు నిమ్మపండ్లమ్మఁ దెచ్చిన నంటక సతిగుబ్బ లంటుఁ దలఁచుఁ
జొక్కంపుఁ దెలిజీనిచక్కెరల్ దేవెలకంపక చెలిమోవియందుఁ గోరుఁ
గనకంపునవకింత దనకమ్మఁ దెచ్చిన నొరయక తరుణిమే నొరయఁదిపుడు
గొప్పసీలము క్రయంబొప్ప నీకిడెదన్న నొడియ కింతికచంబునొడియఁగడఁగుఁ
దేనె యని నూనె నూనెకుఁ దేనె నూనె, లేనెలకు నేయి నేయుంచు దివ్వెచమురు
కాని గొనివచ్చి నించువిల్కాని కాని, కోలసడఁగన్న తోడగన్న కొడుకుమిన్న.

సీ. కవితెనిల్చినయప్పు జవిలిద్రావయఁగఁబోయి బుజవైచె వేమాళ్ళప్పుటలెక్క
నొక్కనికొకకొన్ని రొక్కరాక లొసంగి కాసులలెక్కలో వ్రాసికొనియె
వక్కలలోఁదక్కువకువైచినబరీదు లొకనికి సరకుతో నొడిని నైచెఁ
బైకమిచ్చిన నొంటిపడి కంగడికి నిడ్డ కలపెసల్గంపెడుఁ గొలిచివిడచె
మాటయరవిన్కి నొరునిపై నాగఁ జూడ్కి
బయలుపయికంబునకుఁ జాచుఁ బొణిలంజె
తగవునకుఁ గొంతపిసవెట్టినగవు గనియె
వేశ్యసుద్దికిఁ జెవియిచ్చి వైశ్యసుతుఁడు.

గీ. సెట్టితోరేలు విటుల నన్నట్టిలంజ, సుద్దు లొకకొన్ని లేనివి బుద్ధుకొనుచు
ననఁటిపండ్లొల్చి చక్కెరనద్దుకొనుచు, దాసిపసివెట్టి తోళ్ళసూత్రంబుచిక్క.

గీ. సుట్టిడక సెట్టితోఁ జెవి కొటికి కొటికి, సరవిగాఁ దనకేలికసానివారి

మర్మకర్మంబు లెల్లను మట్టుమీటి, చిరకాసించినదానిఁ గెంబోనోర్చెను.

క. నుడిగి రహస్యోక్తులు దా, నుడిగి దృగంచలనిబద్ధ యనమణిమంజ
ర్యుడము గాణాళ్ళ భిగుణావైఖరి, విదథప శేఖరునితోఁ బ్రహీణతఁ బలికెన్

ఉ. మానిని ముత్తియంబు వెలముద్దియలుం బలెఁ గాదు పల్లవ
ల్చేసిన భాగ్య పుత్రుణి చిత్తరుబొమ్మ రతిప్రవీణ వి
జ్ఞానసరనాగ్రగణ్య మృగనాభిమృగంబు ధనంబు రాశిగాఁ
బోసినఁ బోసమా సుదతియు భూభువనంబున బుట్టఁబోదురా.

చ. ఎలుఁగవు గాక యీకలికి యెంతయొయారి దిగంతరంబులన్
మెఱవడి గన్న కన్నె దొరమెచ్చు మిటారికటారిగాఁడు మే
రువపతి మేరమానసి యయో కడునుబ్బరికత్తె మిక్కిలిన్
గుఱిమఱి వాగ్విలాసమునకు న్మనకుం గొనియాడ శక్యమే.

క. కనకంబునకు న్మందు, న్వెనుక యుఁగన నేల యోయి నీకంటె నా
ధనమున్నిఁ బొగడించితొ, నినుధనముఁ గడించెనో వణిగ్వంశమణీ.

సీ. సఖులు కూఁకటితోనఁ గూడినంత నె కుంతలాధ్యుండు సవరంబు లంపలేడె
చనుబోయి పాటమరించిన నాఁడె అవికజో డల్లపైఠాణి రాజంపలేడె
జఘనభారము కొంత జనియించునెడఁ గాంచికాధినాథుఁడు కాంచి యంపలేడె
మందయానవిలాస మందినతఱి కటకాధీశ్వరుఁడు పెండె మంపలేడె
యంగనసమర్తవెట్టిననప్పుడె నన్నుఁ, గుస్తరించని విటులేరి నేస్తమునకుఁ
బూర్ణచంద్రాస్యయౌవనాభ్యుదయమునకు, నెదురుచూడనిదొరబిడ్డఁ డెందుఁగలఁడె

ఉ. అంగకళింగరాజులు గృహాంగణమందున కాచినారల
న్నంగిలికోదు వారిదు ధనం బది యక్కరొ చక్కఁజూడుమ
న్నంగడకంటఁ జూడదు కనత్కనకాంగి తనంతఁదానె నీ
యంగడిదాఁకఁ బొమ్మనుచు నంపెఁగదా యిదినీకుఁ జాలదా.

క. దానిశరీరము నీదసు, హానిశతాంశంబు లేదటంచున్ ద్రవ్యా
ప్తానిశమదయై బానిస, యీనిశికే తెమ్మటంచు నింటికిఁ జనియెన్.

ఉ. మున్ను విటుల్కొచాకచి సమున్నతి దెచ్చిన కుంతలాళి బా
రన్నిరసించునంచు బలురాయిడి వ్రాలిన చన్నులద్రిఁబోఁ
దన్నినవంచ నుబ్బలకుఁ దాళిన యేండ్లవి పెక్కులుండఁగా
మొన్న సమర్తవెట్టెనని ముద్దియ దబ్బిన నుబ్బె నయ్యెడన్.

క. అప్పు డతఁడు పణ్యాచపలా, విపులాక్షీమణికిఁ బిలచి విపణిపాలంతి పెం
డెప్పు డను తఱి నపరనగం, బుపయిం బడి పారలి ప్రొద్దు పోటుకునఁ గ్రుంకెన్.

సీ. నీవుఁ గాఁగాఁ జేడె చేకూడినది గాక కొంచెగానికి నవకూడు లెట్లు
నేను జూపిన దాని కెచ్చరించినవాఁడ నామాట జవదాఁట దావ్రాక్షి
మఱివారి మేనమామకు నాకు నోయి ప్రాణస్నేహ మెప్పు డింతనాఁట నుండి
వయసువాఁడా రూపవంతుఁడా యంచును నచ్చెల్ల యడిగె నన్గ్రిచ్చి గ్రిచ్చి
కుచ్చితం బింత యెఱుఁగ దమ్మచ్చె కంటెఁ
కంటి విఖ్యాతి నాతిఁ గైకొంటి వనుచు
నచటి జూఁటలు నసగొంటు లతని వేఁడి
వేఁడి మీఁదనె దోచిరి వెఱ్ఱి రేఁచి.

క. తల్లలనావలనాసం। పుల్లదృగంభోజభల్ల భుగ్నాత్మకుఁడై
యల్లతఁడు హల్లకాహితు। డల్లంతట నుండగానె యంగడివీనెన్

సీ. సకునిచేఁ బడిఁగన్న సికమల్లికలు జుట్టి క్రొత్తచందురు కావిగడ్డఁ గట్టి
మునుపంటివలెఁ గాదు నునుపంటనిడుమన్నఁ బొందికఁ గస్తూరిబొట్టు వెట్టి
నీమోమునకుఁ గావు నిడుపయొంట్లవి బాగు గద యన్నఁ గుదువవౌకట్లు దాల్చి
యాకొకకుచ కట్టు నీకొకవగలన్న వలిప సేలువు వల్లెవాటు వైచి
చెలినడుగు నీటు మెడనిక్క చిదుగుపాట, చదురుపదరులు జముదాళిసాము పహిర
హింప వైశ్యాత్మజుఁడు వేశ్యయింటికడకు, నెడలె బాపనచెలికాండ్రు వెంటనంట.

క. ఒకనికిదుప్పటి యొకనికి, సికవస్త్రము వేఱొకనికి సికతాయెతు లిం
టికివచ్చి యిత్తునని యెన్, శకునము బాగాయె నన్న సంభ్రమపరుఁడై

సీ. ఐకదారు లొకదారి శుకశారులెనయు మానికెదారి చెల్లెండ్రి నిలయమమరు
ముంగిట నిడు తిన్నె మూయని మద్దెల కుట్లదండియఁ గుడికూటిగూడ
కోవెలటెక్కెంపుగుడ్డ వాసెన కాఁగు కుంటెనకొండిగాఁ డింటిబంటు
బొజుగిడ్డ కావలిబుడుత గొడుంగులఁ గబ్బిగుండఁడు రసమబ్బు వెజ్జు
ముందుబొద్దాసఁ బాఁతిన ముసుఁగు జూటు, చిగురుచల్లని బలుపూఁత చెందిరంపు
వాస్తుబొలికట్టు గేస్తురాలుస్మరించు, నూరబవినీఁడుగలగృహం బొరసి విటుఁడు.

సీ. వారకాంతామాత వయసునాఁ డెక్కిన ప్రాఁతపల్లకి కొమ్ము పరులు చూడఁ
గట్టి పెట్టిన మిద్దె గడచిపోఁ బనివెట్టు చుట్టుకొలారింత చూచునటుల
విటుల విరాళించినటు లచ్చెరువు చెందఁ బటులాంఛగలిక పాళిఘటనగన్న

పటుపైన యుబ్బుఁ జప్పర ముప్పరం బైన పడకింటి మంచపుఁజెక్కుతెన్నె
పన్నెలతివాసిపై వీణవైణికుండు, గ్నాసదబాపఁడు చదివించు విప్రుఁడనఁగ
భరతమయాగారు విడెమిచ్చుపడఁతి గొలువ, నచ్చెలువ పచ్చికొలువున్న యచటికేగి.

గీ. సురటులు లోకరెండు గోవకస్తురి జవాది, గాజుగిన్నెయ చందురుకావి ఱవికె
కొప్పుసవరంబు పోఁక లాకులు దుకూల, ములుపగాఁ బట్టి సెట్టి కూర్చున్న కలికి.

ఉ. కప్పమెఱుంగు కొప్పనగ కాయలు కాయల కొప్పు దండముం
జొప్పడు దండమట్లు రహించూపిన మేరువు మేరువుం బలెం
దప్పని మెట్లు మెట్ల కొకదారిగ నేర్పడు శిల్పితంత్రిలుం
జెప్పఁగరాని వీణఁ డన చేతికిఁ దమ్ముఁడు తెచ్చి యిచ్చినన్.

ఉ. కోమటి చూడఁ గాంత యొకకొంత పదం బొకకొంతపల్లవిం
జేమెరవట్లు చూపి గుసచెంతకు వీణియఁ జేర్చి దీనిపా
టేమహిపాలకుం డెఱుఁగు నేయని వైశ్యునికాన్క గన్గొన
న్వేమఱుఁగాంచి యమ్మఁబిలువే యని చేటిని బిల్చెనంతటన్.

గీ. నలుసినలుసిన చికిచికినెలులు బొమలు, పాదములు పెద్దపుట్టంబు పడగజోడు
పూతదేవాదులకడెంబు మూఁతినిట్టు, తెల్లవెండ్రుక వీడెంపుఁజొల్లునిగుడ.

సీ. ఒదిగియాత్మవయోవియోగింబుచే నంచనడక సడల్చెనా నడక్కృశింపఁ
బుష్పంబు లుడివోనఁ బొలుపువోసాడిన తీవయో యన మేనిచేవఁద్రోవ
మున్నె పయోధరంబులు వ్రాలకళ డిందు కమలమో యన మోముగానుపింప
నధికశరత్ప్రాప్తి నవతరించిన శుభ్రమేఘమో యనఁగ ధమ్మిల మొనయ
నొంటిపలు సొంటె తలపట్టు కుంటినడక, కంటికాటుకయొడివక్క కాఱిత్తి
వ్రేలియాకొత్తుఁ జెందియవ్వేలవెలంది, తల్లియేతెంచి పిటుకాన్క తెల్లఁగాంచి

క. ఎవ్వరుదెచ్చిరొ కస్తురి, దువ్వట మీఅవికె నెలవతులు సవరంబీ
జవ్వాది యన్న నవ్వెల, జవ్వని యూరవ్య శయనసంజ్ఞం జూపెన్

సీ. ఇతఁడా కళానిధి యాకళానిధిపేరు దగు నీతనికె యెంతదాత జాణ
స్నేహింపఁ దగువాఁడు చేపట్టుకుంచంబు ధనరాశివాఁడు పేదలకు దిక్కు
చుట్టాల సురభి రాజుల చేతినిమ్మపండే రాజు వీఁడె బంగారమయ్య
వెయ్యేలు లిచ్చె నీవిని దొడ్డు కొంచెంబు నేరఁ డేవేళ జన్మించినాఁడొ
నేఁడు మొదలుగ మతియొక్క నీటుకానిఁ, బిలుతువుగదా యహో వెఱ్ఱి
నీవెఱుంగుదు మనపాలి వేల్పుఁ డితఁడు, విడకుమని కూఁతు నదలించి పిటు

సీ. పరియుండుమనె కదా వెలయాండ్రి తీఱుగా దీకాపు పగవార యింతె మేము
మెన్నమానిసి యాటఁ గన్నె కన్నెతికాన నెంతేని రాఘవా రంభికనపు
మేమి కావలసిన నిదె కొమ్ము మేమురమ్మనిన వచ్చెన నెుప్పవైతి వేని
వాకైన విని పిండుపాటు చేసెద మిదె యంచు పట్టైదు ముడుపంచు నగలు
పెట్టెఁడంకినఁ బట్టి నిన్నుఁట్టినాన, నీవుపోరానివాఁడవు నిన్నుఁ గిలో
యారిగుడిలోన నినుఁజూచె నఁటగదావ, రాకు తెలుపరయ్యొ నీపైవిరాలిఁ బోరలి.

ఉ. నీమహాలంతు లెల్లఁ బమ చేతికి వచ్చినదాఁక నోయి నా
సామి వితీర్ణ కర్ణ యనసాగుదు రంతటిలోన నోయి నీ
గామచూ నానుమెయ్యొదిరియొకా యనఁజూతురు కూఁతురాపగ న్
గామిడికత్తెగాదు మిముఁ గన్నులఁ గప్పకొనంగ నేరుచున్.

ఉ. ఎవ్వనిఁ జూచినం గళల నిం(దునిఁ జందురిని నిన్నుఁజూచిన
త్రివ్వనరాశి వేష్టితమహీ సరిహిఁ జూడగఁ జుచ్చరించు నా
జవ్వని పిండు రెండవ బిసప్రిసవప్రిదరుండవే ధృతిం
నవ్వఁపుఁగొండ విచ్చకముగాదు సుమీ తమతల్లితో డనన్

క. అచ్చేడియ తచ్చనలకు । నిచ్చమహోత్సాహ మంది యిచ్చెలువకు నే
మిచ్చిన ఋణంబు గాదని । బచ్చు రుటంబచ్చుపడఁగ భావించి మదిన్.

క. భావించి సఖునిఁ గన్గొని । రావించి దుకూలములు వరాలుం దెమ్మా
యీవనిత కనుచుఁ జెలినని । యీవలఁ దెప్పించి మఱియు నిప్పించుట యున్.

ఉ. అప్పుడు లంజెసాని సొగసాని కదంబయితాణి యొప్పుగం
గుప్పస మింత్రగుచ్చి కుచకుంభయుగం బరనిక్క నీల్గి బ
ల్గొప్ప కకుప్పఁ గప్పురుచి గుప్పఁగలేచి తటిన్మరీచిక
ల్గుప్పలు గాఁగఁ జూచి గురుకుంజరు పీడ్కొని వేడ్కఁ రక్కొనన్.

ఉ. మజ్జనశాలకై యరిగి మజ్జనమచ్చట నాడివచ్చివే
ఋజ్జవమొప్పఁ దల్లి యిడు పూన్కి భుజించి ధరించి గొజ్జెఁగ
ల్గొజ్జఁగనీట నీటుగను కుంకుమపంక మలంది కంతుచే
గజ్జెలకోల దాల గణికామణి తారణితాంగదాంఘ్రియై.

ఉ. పంకజపాణిచక్క నిడు పావలు(ద్రొక్కి శయావశిష్టపుం
గుంకుమ పావడం దుడిచికొం చుడిగంపుఁబడంతి దృగ్విలా
సాంకితచుట్టియిచ్చు తెలనా కథరంబునఁ గొంచు రత్న తా

టంకధగద్ధగప్రభటంపుతటిల్లతపిక్కటిల్లఁగన్.

సీ. ముదుఁగుఁదామరకిందనడఁగుక్రొంబలుపుతో నకినెలపట్టిమంచపు రుటంబు
డగ్గఱ నేస్తకాండ్రకు నిడ్డజగపీఁట తళుకుబంగరుకాసెఁ దగులుతగులు
వేఱెయొక్క ందుకై విటమోహమున నూఱు బాగాలువైచు కప్రంపుబరణి
తెల్లజిల్లెడువేఱు పిళ్ళారి దివెగూడు గాజుటద్దము కావుకరవటంబు
పట్టుపుట్టంబు సొగటాలపాళి నేఁత, పాత్రచిటిచాఁప మంచి విపంచి మంచి
సుతులు గూడిన దండియసొంపుగన్న, పఱుకయిలుసొచ్చె నిప్పుడప్పణ్యమహిళ.

క. అలరుందావియు గందపు, వలపున్ సాంబ్రాణిధూపవాసన యిలు వా
కిలిసారముంచిన విటమణి, కలకాలం బిచట బ్రిదుకఁగాఁ దగు ననియెన్.

మ. రణనాటీకచరాలురత్కలరపీరంగ ద్విటంకంబు ఔం
కణలబ్ధాంగణవేదికాభవన భక్కత్కర మామోదనా
చణశయ్యాతలపీఠ శుభ్రపటవాసభ్రాజి పేటీక మ
గ్గణికాకేళినికేతనంబు విటవర్గస్వర్గ మీక్షించుచున్

క. అగురుగురుధూప కుంకుమ, మృగమదపాటీరపంక మిహికాలహరీ
లగనఘనగంధగణికా, నగణితపర్యంక మర్యనందనుఁ డొందన్.

క. పాటీరగంధిగణికా, జూటీరత్నంబు వైశ్యజునకుం దనకున్
వీటీదాస్యము సేయుచు వ, ధూటీమణి సమయమెఱిఁగి తొలఁగినపిదపన్.

సీ. పైపూఁత తమి లీలఁ బైవాత్రిల జుమ్ము రనియె వైశ్యరాధేయునికిని మేను
కంకణార్భటుల బాగాలు చేనిడుపూన్కి నగరేశ్వరునియొడ ల్లగురుపాడిచెఁ
దెగఁగాఁ గొతికి నోట సగ మెసంగినచుట్ట మలయజావల్లభు మైచెమర్చెఁ
బుక్కిటతమ్మలం బొక్కింత చవిచూప నుత్తమజన్ము మే నుబ్బెఁ గళల
మోవి చిక్కించుకొని పంటిమొనల నొక్కి, దక్కితి నటన్న కలరవోత్కంఠకంఠ
కపకివధ్వనికిని గణికకు మనంబు, క్రియముగావించె నుద్యోగరాఘవుండు.

చ. సరసపుఁ బల్కులన్ బడకసంగతి కొప్పని గచ్చులన్ బయో
ధరతటు లంటనీని వెడతక్కుల నెయ్యపుటూదికొట్టులన్
సురతపుఁ దృప్తి లేనియరచొక్కుల వాతెఱతేనె గుక్కిళు
ల్నెరపుటలన్ గిరాటవిటు నిద్దపుఁ జిత్తము మెత్తఁజేయుచున్

చ. అలఘునఖప్రణంబులఁ గరాంగుళికాధ్వని నర్మమర్మపుం
బలుకుల రంగుముంగురులపట్ల భుజాంతరముష్టి ఘట్టనం

బులఁ బదతాడనంబులఁ గపోలచపేట విలాసచేష్టఁ జ
క్కిలిగిలిగింతకాటుల మృగీదృశ లోనుగఁ జేసె వైశ్యజున్

ఉ. చక్కెరమోవి యిచ్చి బిగిచన్గవ కౌఁగిలి యిచ్చెఁ జెక్కుకాఁ
టొక్కటి యిచ్చె గోరు కొన నూరులు చింపఁగనిచ్చెఁ గాని యా
దిక్కునఁ జాచు కేలు సొరిదిం బిరుతివ్వక తట్టివైచె నాఁ
డక్కఱినాత్మరా లతనిప్రాణము చూడక మాటిమాటికిన్.

గీ. రవలిదండలు సడలించి ఱవికె దిగిచి, కాంచియెడలించి నెఱికచెంగావి చుట్టి
పోఁకముడి యొంటికట్టుతోఁ బువ్వుబోఁడి, పడక కొప్పినచందంబు పతిఁగరంచె·

చ. పడకకు నీవజాణ వని పైఁబడి హాయని మోము మోముపై
నిడి వలచెక్కుటద్దము కయిన్వడివెట్టి యురంబు తట్టి యి
మ్మశిగద యక్కతోడు మదిమక్కువ నీపయి యక్కరైన య
స్వాదు వెల కమ్మకొమ్మ పొరపొచ్చెగాదు వధూ మనోభవా.

చ. నిలువునకుం గరంగఁ గళ నేర్పున నంటితి నీవు చాలదా
తెలియను నిన్న మున్న నొకతీరుగఁ జూచితి నీదుకౌఁగిట
న్వలవని యాటుదింగలుగునా యని పైకొని నిల్చినిల్చి య
చ్చెలిపయివ్రాలి మోవి కఱచెం గరఁచెం గరచేష్ట నీరుగన్.

క. పికవాణీగళవిగళ, త్కకపికశుకకులనినాద కవకివరవయు
గ్వికవిక కిలకిలహాసన, ప్రకటవ్యసనముల కతఁడు పరవశుఁ డయ్యెన్.

ఉ. చక్కనివాఁడ వీవెకద జాణవు నేర్పరి వంచు నక్కుపై
మక్కువ వ్రాలి తత్కరము మైసవరించి సిగంది వంచి య
చ్చెక్కిలి మిక్కిలిం గఱచి చేతికొలంది నురంబుగ్రుద్ది తా
నక్కడ ముద్దువెట్టుకొని యాసతి దాసునిఁ జేసె నవ్విటున్.

క. ఇదియేపరమానందం, బిదియెపరబ్రహ్మ మనుచు నెంచంజంచ
న్మదనాగగామినీకృత, రదనచ్ఛదనచ్ఛిదాచ్ఛరాగచ్ఛలుఁడై.

ఉ. రాలినవాఁడుఁబువ్వులు ధరంబడువక్కలు నాకుఁజీరిక
త్నెలను జిందు గందవొడి నిండిన తమ్మకరల్ కదంబముల్
వ్రాలిచివైచుకాగితము వత్తి రవుల్గొని మ్రగ్గుదివ్వెయున్
హేలఘటిల్లు నప్పుడుకయిల్వెడలెన్ విటమాళి వేకువన్.

క. నానాఁటికి గణికామణి, పైనాటినకూర్మి పేర్మి భర్మపటంబుల్

దీనారంబులుఁ జేర్చిన, దీనారంభముల నతఁడు తిరుగందొడఁగెన్.

గీ. ప్రత్యహము నూనె సీకాయ పంచదార, క్రొత్త పోఁకలు మిరియ మింగువ గుడంబు
ముత్తెసరులు పెసలొట్టి గుత్తలంజె, కత్తిపుత్తెంచి యంగడి రిత్తచేసె.

ఉ. అల్లుఁ డటంచుఁ దల్లి తమయాతఁ డటంచును గూఁతురన్నిటం
బల్లిదుఁ డేలికొననుచుఁ బానిసె వావిని బావయంచు న
చ్చెల్లెలు నచ్చినట్లుపముఁ జేతులు వైచుచు ముద్దువెట్టి పైఁ
ద్రెళ్ళుచు నల్లిబిల్లివగఁ దీసిరి వాసివరాలు రాశిగన్.

సీ. రత్నంబులిచ్చి వారవధూటి దయఁదెచ్చి పుష్యరాగోదయస్ఫూర్తి వదలెఁ
గలసొమ్ము చేర్చి మేల్గణికామణికిఁ గూర్చి కూర్చినభరణిపైఁ గూర్మివిడిచెఁ
దనమంచిలంజెపై మనసువెంచి పునర్వసూదార సంగ్రహమోదమడఁచె
గాదెకొల్చెత్తి వేశ్యాదరం బత్తి విశాఖలసత్ప్రేమ చాలుననియె
రోహిణీభర్త రత్నాకరుని యనుంగుఁ, బట్టిమున్న కళానిధి పలుకులేల
చిత్తమిడె నేని యేమేమి సేయలేదు, కంతుహరునైనఁ బెల్లాటకత్తెతగులు.

క. అడుగనివానిదె పాపము, పొడఁగని పద్యంబుఁ జదివి పొగడఁగనిడు తా
నుడుగని యీవులు వలరా, నడగనినుడుగులమిటారి నను పెట్టి ద్రొక్కో.

ఉ. వైశ్యకుమార మారపరవైశ్యధరాధరవజ్రధార దు
ర్వైశ్వహృదంతశల్య శరవైశ్యభయంకర లోభవద్భవ
ద్వైశ్యభుజంగ యంచుఁ గయివారము సేయుచు దుస్సి రర్థము
ల్వైశ్యలు నట్టువ ల్మణితవేత్తలు మట్టులు జాతికత్తెలున్.

క. ఉద్యోగరాఘవుం డని, పద్యంబులు నూకఁ గేరి పంచలఁ జదువన్
విద్యాధికులకు వల్లము, చోద్యంబుగ విడిచి లంజ చూడఁగ నిచ్చెన్.

సీ. అప్పువెట్టినచోటి కడుగఁబోవఁడు గాని పణ్యాంగనలతప్పు పైఁడికరుగు
నొకరికిచ్చినవెచ్చ మొకటివ్రాయఁడు గాని మకరి వేశ్యాగల్లముకురివ్రాయు
సంజబేరములాడి సంచిగట్టఁడు గాని గణికాలలామకుఁ గాసెగట్టుఁ
దాసువణ్ణముఁ దూఁచఁ ద్రాసువట్టఁడు గాని వారకాంతను సొమ్మువహికిఁ బట్టు
వింతచిల్లరతండ్రి కందీఁడు గాని, యల్లవెలచేడియకు విడెమంది యిచ్చుఁ
జేటికా సఖికోటికాచ్ఛిన్నకటుఁడు, శాటికాహృష్టనటుఁడు కిరాటవిటుఁడు.

సీ. ప్రతిదినంబును జెంపపై రేఖ దిద్దించి ప్రొద్దొకవగ వన్నెబొట్టువెట్టుఁ
దనచేకొనని యా చకునకుఁ బొమ్మనిపల్కు నెలకట్టడలు సేయు నేస్తకాండ్ర

కొఱవేడు నర్ధార్ధి కోయి రమ్మని యిచ్చు నొల్లనిచో బలిమి నిల్లుసేర్చు
సేరు కుంకుమ నూఱి చెలికాండ్రపైఁ జల్లు గోణముతోఁబోవుఁ గోకలిచ్చు
కలఁడె నీవంటి బలువెచ్చకాఁ డటన్న, నధిక లీలెఱిఁగినఁజాలు ననుచు బిగియు
దర్పణాలోకనీయకందర్పకేళి, ఫలితనఖపాళి పల్లవపాశమాళి.

ఉ. గాయకుఁ డొక్కగాయకశిఖామణి నాయెడఁ దద్గుర న్విప
ణ్యాయతవృత్తి వతిఁ లు పిృయవృతసూనునిఁ గాంచి వైశ్యరా
ధేయ సుధీజనావలివిధేయ భవత్సుతుఁ డిచ్చినట్టి కా
శేయముఁ గంటె దానగుణశేఖరుఁ డంచుఁ బదంబువాడినన్.

ఉ. ఉల్లము జల్లనం గలఁగి యొక్కడఁ దక్కడకోల వైచి వీ
డొల్లఁడొ కాని విద్యలనియుంటిఁ గదా యని కొంత చింతతో
వల్లము పాఱవైచుకొను వైశ్యునిజాడ నిజంబుగాననం
జిల్లర బేరము ల్విడిచి చేరికుమారునిఁ దండ్రి యిట్లనున్.

క. ఓరితిరిగెడువేశ్యా, నారీతిలకంబు తగులునంబడి యెటులం
జేరొక్కమిచ్చిచెక్కిటి, గోరొక్కటిఁ గొంటి కొంటిగొంటు తెఱంగుల్.

క. కేవలనైపుణి విపణిన, యోవలసిన బేరసారమొందక యెందున్
నీవలె నీవలఁ దిరిగిరె, కోవెలవెలయాండ్రనంటికోమటిబిడ్డల్.

ఉ. ఎక్కువ దెచ్చి తక్కువకు నింటికడ న్వర కమ్మఁ జూచుటో
వక్కలు నాకు లమ్మి బుధవారపు సంతకు జట్టిగట్టుటో
లెక్కలసంపుటంబుఁ బ్రబలించుటొ కోమటివారి పిన్నవాఁ
డెక్కడ లంజబేర మది యెక్కడ నెక్కడి కెక్క డక్కటా!

గీ. ఒక్కనాఁడైన ననువైన వక్క దినక, చిక్కచల్లయుఁ బెరుగుపాల్గుక్కఁ డెఱుఁగ
కెక్కుడుగఁ గూడఁబెట్టిన రొక్కమకట, యక్కడికిఁ జేర్పనీకుఁ జేయెక్కడాడె.

ఉ. చూడమె దాని యిల్లు రవిచూచినసూడియఁ గేరితూర్పున
న్వాడకుఁ బశ్చిమంపుఁ దలవాకిలి గచ్చుటరంగుగోడకున్
వేడుకకాండ్రయోటములు వింతలువాృసిన వీడు గాదెయా
కోడె మిటారి నాగడనకున్మతిపాతృమె నేఁడు పుతృకా.

శా. ఈచాకట్లపయిం బదైదులు వరా లిమ్మి మొద ల్వడ్డియు
న్వేచెల్లించెద మెప్పు నీవడిగిన న్సెట్టియన న్గల్గినన్
మాచేనుండునె మెండుగా సరకుఁదేమా యందుఁగా వారి మో

మేచందంబునఁ జూతు నాగడన నీయావు ల్బయ ల్చేసెఁగా.

ఉ. నంచులు మోసి బేరముల సంచులు నించిన కాంచనంబులుం
గుంచెడు మాటల న్విటులఁ గుంచెడు చంచలలోచనాళికిన్
గొంచక పంచిపెట్టితివి కుంచెడు కుంచము కూడఁబెట్టిన
న్మంచము మాయసేసె ననుమాట ప్రపంచము గాంచె నెంచగన్.

సీ. వెచ్చంబు చేసినఁబుచ్చినగొంటుపోఁ కిచ్చిననొకజాడపచ్చనాకు
కొమ్మన్న నలసందగుగ్గిళ్ళు కొణిదెఁడు పెట్టెడుచో నుప్పు పిడికెఁ డంత
యిందమనిననాలుగే న్మిరియపుగింజ లిడుదేని తలకింత యిప్పపిండి
దయచేసినను గూరదంటు వేఁడినవిరెండొసఁగిన దోక నల్లపసువుఁగొమ్ము
పాలుమాలిన యేనొక్కపఱికగాక, కుదువయిచ్చిన సామేన్మి కోకలేమి
తల్లిమెడనున్న నాసేమి దండలేమి, కొడుకమనజాతిలోలేనిగుణముగలదె.

ఉ. మక్కువ నొక్కవేళల సుమాళము వచ్చిన పంచె కొంగునం
దక్కరి పాఁతకాపులొక తారముగట్టి రమింపఁ బోయి మే
మక్కడ రొతు బంటునికి నందమ్ముగైకొని సానికూఁతురా
చక్కెర లెక్కరాదనుచుఁ జక్కఁగ వత్తుము రొక్కమిత్తుమే.

క. తారము గాకుండిన నవ, తారము తారము పసిండి తగువెలనవలా
బేరము మఱివైశ్యస్త్రం, బేరమునకె తగుదుగా కుబేరముఖులకున్.

ల. నెటికెలు దిస్సి చే విసికి నిక్కి యొకించుక యావలించి నం
జిటికలువేసి మైయొరగుచేసి భుజంగులవాతెఱల్సదా
ఘుటికలు చేసి దబ్బరలు గూసి సదా సికరాసి మాడలే
పుటికలఁ బోసి వాసిగను పొత్తులతొత్తుల కేడ సత్తెముల్.

క. పండుగలని గుడిలోపలి, దండుగలనికొండలయ్య దాసళ్ళంచున్
మిండలమిత్తి మిటారులు, తెండోయని దోచకున్న దినములు గలవే.

ఉ. కంజభవాదులు న్మనసు గానరుగా నరులారతిక్రియన్
రంజిల జేయువార లపరంజి యొసంగెదువారు కన్గొనన్
గెంజిగురాకుఁ జూపిన భగేలున లీలని గుండెవారరో
లంజెలపొందు లింతలఁతులాహృదయాంతమునం దలంతురా.

క. అచ్చిక బుచ్చిక లప్పటి, మచ్చిక వెచ్చకుఁడు గామి మచ్చరముల పై
యచ్చక యిచ్చిన విటుఁగను, విచ్చి కనుట సొమ్ము సున్ము వెలవెలఁదులకున్.

సీ. పడపుఁ బూఁబోఁడికి బత్తి యెదురుచుక్క పణ్యాబ్జపాణికి బాస దవ్వు
వెలవెలందికివిటవీథిపై దయసున్న వారవామాక్షికి వావి తవళి
పెల్లాటకత్తియ కెల్ల నంటు హుళక్కి గణికామతల్లికిఁ గాని వావి
లంజకు మర్యాదలాగు దుత్తూరంబు వేశ్యకు సత్యంబు వీఁక దుద్దు
నాగవాసంబునకు వర్తనంబు టక్కు, సూళియకుఁ బ్రేమబిద్దు బోగాలపాలఁతి
కిని గృతజ్ఞత యట్టట్టుఁగనుక వెనక, వెనకనలదురూపాజీవవిశ్వాసనము.

శా. వియ్యాలందిన విందు నిందనముఁ గావించంగ నంగళ్ళనుం
గయ్యాలయ్యెను నిన్న మాపు గలఁతం గైకొంటి మేల్గాదె మా
యయ్యా! లంపట పెట్టనేల మముఁ జింతాపారసంతాపమై
యుయ్యాలయ్యె మదీయచిత్త మకటా యారవ్యవంశాగ్రణీ.

క. ఈపాపఁడు నీకొమరుం, డాపణపణనిపుణుఁడా ధనార్జనమందు
న్నీపాటి త్రాణవాఁడా, యేపాటి యటన్న వారియెడ నేమందున్.

క. అనిపలుకు తండ్రివచనము, చెనఁటితనూభవున కింత చెవిఁజొరదాయెన్
మన సాఘనసాంద్రకచా, వినయోక్తుల చేను మేయ విడుచుటవలనన్.

సీ. తళుకురుమాలులోఁ దాయతుల్ గానరాఁ జెంప దుంపెసలారు సిగపుటంబు
చిటిగొరిజెలు దాటి జీరాడు ములగపూవన్నియ కండువా వల్లెవాటు
నుదిటి వెన్నడుచక్కి నుదిటించి విరిమించ దిద్దిన నెలవంకతీరుబొట్టు
మునివ్రేళ్ళఁ దగిలించుకొని చురుక్కనఁద్రొక్కు సకళాతుముచ్చెల జరుగుటెక్కు.
చెక్కుటద్దంబునకునొక్కు నుక్కుగోరు, బెదవిపయికెక్కు పలునొక్కు పెక్కురేఁగ
గచ్చిచల మెచ్చ యమ్మచ్చెకంటి మెచ్చ, వాడబచ్చిగఁ దిరుగాడు కోడెబచ్చు.

సీ. కంతపీఠికఁ బేరుగావైచి మెలిగొన్న తెల్లని యొంటి జందెంపుఁ బోఁచ
నేవళ మందంపు నెటిపూత గందంపు దాఁపలివలెవాటు పసిలుసేలు
పటికంపుఁ బిడివంకిపైఁ గట్టు మొలకట్టు బిల్లతోఁగనుపట్టు చల్లడంబు
వాడ ప్రోడలు మెచ్చ వన్నెపచ్చడమిచ్చి తాఁగొన్న గిలుకుటద్దంపుజోడు
వీటవిటకోటి యడగని వీడెమిచ్చు, బుడుత మిడుత యొసంగు చేవూన్కిపికిలి
చికిలిపలుకుంచనపుఁ దల్కు వెకలిసకుల, గూడితిరుగాడుఁ దొడగన్న కోడెకాఁడు.

ఉ. తేజనభాజనంబుఁగొని తిన్నని యాకిడి యన్నమాజ్యమున్
భోజనయోగ్యశాకచయమున్ నయమూనిన సూపముం గరాం
భోజనవీనతక్రదధి ముఖ్యములొప్పఁ బురోహితుండు దేఁ

భూజన మెంచు నంచపుడు భుక్తిఁ గొనుం గణికాకుటీతటిన్

క. తిట్టని చుట్టము దోఁచని, బట్టుం బచ్చనిభుజంగి బచ్చిరువారం,
బిట్టారఁజనని యొంటరి, సెట్టియెడంగసము సెట్టియింపెట్టిడియో.

గీ. తల్లిదండ్రులు నిల్లండ్రు నెల్లకడమ, కాసువీసంబు చోటుల మోసపోవ
నేఁడు రేపను వగలేని నీటుకాని, పినివిడనాడ కుండిన వేగదనుచు.

సీ. చేరొక్క మెత్తు కుబేరునంతటివానిఁ గాపుఁజేసి గడించు కసిరువాటు
కలనైన నన్యకాంతకుఁగాని కాపును గనువేసి విటునిఁజేసిన గయాళి
యేఁచి వల్లము దోఁచి గోఁచి చేతికినిచ్చి చిఱుతసన్న్యాసిఁ జేసిన పిసాళి
యవలోకములఁదేల్చి యలద్వితీయ వసిష్ఠుశిష్టుని భ్రష్టు చేసిన బజారి
బిగిసి కూర్చున్న కోమటి బిడ్డఁజూచి, బొమలుముడివెట్టి వలదన్న ప్రతిఁదిట్టి
తారసిలిరోసపుఁగడంకఁ దలవడంక, ననియె నప్పుడు పణ్యవృద్ధాగ్రగణ్య.

గీ. పున్నమ యమాస యనుగడులెన్నిచెల్లె, మొన్నటికి మొన్నటంటివి నిన్నఁటికిని
నిన్నటాయెను నీయావియెన్నఁడింక, తవలిదుత్తూర నిన్నువీడకతరంబె.

గీ. జోకఁబదియైదు లీకున్నఁ గోక యొకటి, కాకయుండిన నొకమేక లేకపోయె
రూకరుద్రైన నీవలెఁగాక వట్టి, రాకలకుఁ బిల్చునా గణికాకులంబు.

క. సిగ్గుగల సెట్టియనుచుం, దగ్గఱనిడుకొన్న కూఁతుఁ దడవక యుప్పుం
గుగ్గిళ్ళముల్ కొనెడి ని, న్నెగ్గాడిన కొదువ మాది యేమనవచ్చున్.

క. ఏమీ మాసాముల్లల కొరుఁ, డేమనునో పచ్చపైక మిచ్చుటకలదా
కాముని పున్నమ నుండియు, గోమటియుం జూచిచూచి కొమ్మనగలఁడా.

క. పెస లరపడేఁడుం బడిమెడు, పసుపున్ నేబెత్తు కొంతి పడి వసచిదరల్
గసగసలు సెనగపప్పాక, యిసు మంతయుఁగాక పైకమిచ్చుట కలదే.

క. దివ్వెలపండుగకేమో, దువ్వట మిచ్చితివి దాఁచదోసము కలదా
తవ్వెడు బియ్యము వల దొక, రువ్వైన నొసఁగనిచోటు రూపం గలదా

క. బంగారు వంటి బిడ్డ మ, ముం గైకొన దీవు వలల ముంచుటచే మీ
యంగడికి వచ్చు జోగులు, జంగాలేమందు లొసఁగి చనిరో నీకున్

క. అంగడిఁ బెట్టెదు మూల న, డంగిన వేశ్యలను వైశ్యుఁడవు గనకో యీ
దొంగవగ నోరు వెక్కస, పుం గోమటి రొక్కమీక బోసేయఁడుగా.

ఉ. అన్నకుఁ దండ్రికంబికకు నక్కకుఁ దెచ్చిన వక్కలాకులుం
దిన్నఁగ వెచ్చపెట్టి గృహదీప మొకించుక యాలఁజూచుచున్

సున్నము పాఱవైచి వడిఁ జూపినచో జగడించు కూటముల్
కన్నకరాబి నీకుఁ దగుఁ గాక కటా జగలంజ కేటికిన్

సీ. సోదనయొకపడి చూపి యప్పుడ మార్చి వేఱొక్కపడిగొల్చు వెరవు గనుటొ
పరకపాతికగాఁగఁ బడిగొల్చి యాపడి పాతిక పరకగాఁ జాఱిఁగనుటొ
యెత్తుఁదూఁచినచోనె యింత తక్కెడకోల మలుచుట్టుకొనితూఁచు మాటగనుటొ
సరకెత్తునకునుగొంచకతూఁచియును మ్రొగ్గనటులఁదూఁచిభ్రమించుహారువుఁగనుటొ
కటకటా నీకు వేడుక కాని వగకు, నెంతదూరంబు నుసలించకిల్లువెళ్ళ
పీఁచమడఁతునో కోమటికోఁచయనుచు, వెలవెలఁదితల్లి మెడవట్టి వెడలఁద్రోచె.

క. త్రోపువడి లోనఁ గ్రిమ్మరు, కోపంబున గుడ్ల నీరు గ్రుక్కుచుఁ బూర్వా
టోపంబు విడక గణి కాం, బా పరిభవ మింత బయలు పడ నీక యొగిన్.

మ. నిలుచున్ వాఁకిట మళ్లి పంచకడ తిన్నెంజేరు నందెవ్వరే
వెలివెళ్లం దనుఁ బిల్వవచ్చిరని భావించు న్నిరాశం దుదిం
జలియించుం దిరుగం గనుం బరుఁ బిలన్ సంధించి నన్నా యనుం
గలివోయన్ మఱి యుట్లు వంక గనుటల్ గన్పించె వైశ్యుం డటన్

మ. వెడలం ద్రోచినఁ జూచి నే వెడలినన్ వేఱొక్కఁ డత్తున్ విటిన్
విడరా దెక్కడనైనఁ దెత్తునని తండ్రిందల్లి నాఁడింటి కం
గడికిం జేరఁగ నీమిఁ జేసి శ్వశురాగారంబునం గమ్మలుం
గడియంబుల్ ముడుపెత్తి తొంటియటులం గాణిక్య వీథిం జనన్

క. అల్లంతట నూరవ్యజ, తల్లజుఁగని పల్లవీ మతల్లిక యనుఁగుం
దల్లి విటభల్లి రా యటుఁ, దళ్లి పదాగ్రమునఁ దలుపుఁ దటుకునవైచెన్

గీ. వైచి లోని కరుగు వాకిలిఁగన మళ్ళు, గడియ టగిచి మరల గట్టిసేయు
బట్టి గుత్తవగను సెట్టి యెక్కడఁ జొచ్చి, వచ్చునో యటంచు నిచ్చఁగొంకి

క. కడియాల జోడు విటు చే, ముడుపుం దలుపోరఁజూచి ముదిముదిత వడిం
గడియ సడలించి బెడగొం, దెడి వీథికవాటమింత దెఱచుచునంతన్.

క. నీవా! నీవనియెఱిఁగిన, నావంటిది తలుపువైచునా! యల్లా
కోవెలబాపడటంచున్, భావించితి దేవరాన బంధునిధానా.

క. పైఁడివగలేనివేడుక, కాఁడై వడతునుక చోసె కానుకలంచున్
వాఁడొక డీకడదినమొక, యేఁడై యెడఁదాక నాగ్రహింపఁగ వలసెన.

క. ఇన్నిదినంబులు చూచితి, వెన్నఁడు నీకడ్డ మొక్క యుంచుక కలదా

యున్నాతి యింటికి జెపట, చిన్నది నీకెడమె వింతసెట్టిపై మాకున్.

క. నీపై జేసె నాక్షేపము, చూపితిఁ గద వెనుకఁ గడుపు చుమ్మలు చుట్టెన్
బాపంబుఁ గట్టుకొంటిఁ గ, దా పసుచాయంటిఁ బిలిచి యడుగుము దానిన్.

క. నీదండ నాడెనది నో, రాజేశమువా రెఱుంగరా యిన్నికమా
మాదేవరరఁగుమీఁద మి, కాపరమునఁ బూజసేయ నప్పుడవు చుమీ.

క. ఈయిల్లు నీదు సొమ్మని, యాయిల్లని లోనియింటి కటఁగొని చనుచోఁ
జేయిచ్చెఁ గూఁతుమాటకుఁ, జేయిచ్చెం జేతిసొమ్ము చేతికొనంగన్.

క. ఈతనిపైఁ గూఁతుర నీ, వీతడి దయదాన వగుట యెఱుఁగఁగ నిచ్చెన్
రాతిరినుండియుఁ గంటిక, రోతుడె నిదురెఱుఁగవే కదా యనిరంతన్.

ఉ. అక్కరినాత్మురాలు వెలయాలు భుజంగు నిజాంబికా భుజా
భాక్కరు రొక్కరూక లిడు బచ్చుఁ గవుంగిట గుచ్చిగుచ్చి ని
చొక్కపుఁ జెక్కుటద్దములఁ జొక్కుచు నీడలు చూడకున్న నాఁ
డొక్కయుగంబు తావకవియోగ మయోపవియోగజింపఁగన్.

సీ. ఓరోరి నావేంలికొక్కింత యుండనీనాయని బటువులు నాఁచుకొనియెఁ
బల్లలమొలనూలి యల్లిక వింతంచుఁ దాగట్టుమొలనూలు దక్కఁబెనఁచె
యిదికత్తికంటెన నింతులెంతురటంచుఁ జెవులచౌకట్లకు జిగురుపైచె
నీపూటకే కట్టితెప యిచ్చెద నంచుఁ దెలిపావడము కట్టుదిగిచిపైచెఁ
గడవకూడును బెడిదంపు గావుపోతు, పోతురాజంగ్యకంచును జేతివల్ల
వల్లము సడల్చి యుల్లము కల్ల కూఁచ, కూచముట్టుగదోచె నయ్యువిద యతని.

ఉ. దోఁచినముల్లె గాటగుట దోఁచిన మాయెదురింటిదానిపై
రేఁచిన మాపులేమి తుది రేవగలచ్చట రచ్చలేమి చే
చాచిన నిచ్చలేమి యిటఁ జాలును మీరటకే చనుండు నో
రాచిన సిగ్గెఱుంగ వని యాగణికాంబ కృథావలంబయై.

గీ. దొమ్మరులవీడొ పల్లికూటమొక్క మయిల, పంతొ బెస్తలసాలొ జాజంపు గట్టొ
రచ్చకొట్టంబొ తనమందిరంబు నీకు, గజిబిజియిదేమి నీనేస్తకాండ్రు నీవు.

క. ఆచార్యపురుషులార్య సు, ధీచంద్రులు జపితలుంబ్రతిష్ఠితులు యతు
లాంచకొమాళ్ళును నిన్నుం, జూచిన మందాక్షు లెట్లు నుడియుదురిటకున్.

ఉ. పిట్టపగళ్ళు రేలిచటఁ బాయక యుండెదు మంచివాఁడవే
చుట్టమువచ్చు టెట్లు నినుఁజూచిన నీగోడవేల కట్టుకో

బట్టయినట్లొ కూరకొక పాతిక కాసులొ యొట్టిగొడ్డు తా
కట్టని తాడనాస్పదకృకాటిక చేటికఁగన్నుఁగీఁటినన్.

క. పెద్దాపె కోపమూఁటిన, నిద్దఱ మరుదెంతుమని బహిర్ద్వార్వేదిం
దద్దుర్మదు నిడి చేటిక, బద్దులపుట్టిక కవాటబంధ మొనర్చెన్.

క. అంటి కిరాటుఁడు విటుఁడై, యింటికి గాకెల్లధనము నిచ్చియు వెలవా
ల్గంటికిఁగా కప్పంటికి, రెంటికిఁ గొఱగాని తొంటి రేవణుఁ డయ్యెన్.

ఉ. తల్లడమంది పల్కు విటతల్లజుఁ డెల్ల జగంబెఱుంగఁ దా
వల్లము చేతికిచ్చినను వల్లముసుమ్మన దంతె కాదుపో
కల్లలపుట్టినిల్లు మఱికల్లరి పల్లవవల్లవీఘురిన్
దల్లిని జేయవచ్చునె విధాతవృథా తరుణీమతల్లికిన్.

మ. ఒకనాఁడైన నభీష్టవస్తు విదితేవో యన్న లేదంటినో
యొకవేళం దనుదోఁచి నీచగృహాకృత్యోద్యోగము న్సేయనో
నికటక్షోణి నిజాంగరక్షణకు ముక్ దేవళ్ళకున్ మ్రొక్కనో
యకటా! యీజరఠాధమాధమకుఁ గ్రోధావేశ మింతేటికిన్.

క. కడియం బీనో పుత్తడి, కడియం బడిగినను దేనొ కంటెయుఁ గొననో
మడియవగతొత్తువాకిట, గడియ బిగించెన్ ఫలించెఁగద యనువేళన్.

సీ. వెనువెంట నొండొండు విరిరాల నరజాఱు వేనలి మూఁపుపై వీయమంద
మెఱుఁగుగమ్మలడాలు నెఱిమించుటద్దంపు నిద్దంపుఁజెక్కులు నీటుఁజూప
సందిటియపరంజి జాజికాయలచేరు జమిలితాయెతులతో జతవహింపఁ
గుచ్చులదారంపుకొనతోడ సరిగంచుపైఠాణినెఱికపైఁ బరిఢవిల్ల
నిఱుకుఁజనుగుబ్బకవ పైఁట నొఱపు నెఱప, సన్నకాటుకచుక్క బొట్టున్న గొలుప
నిగనిగనిమేన నలుఁగిడ్డమృగమదంబు, బుగులుకొన నిల్లువెడలె నప్పువ్వుబోఁడి.

చ. వెడలి విలోకడంబరము వెంబడినిం బడి యంగహావపుం
గడలి మునింగి పెంపుడు మెకంబుల మెండున మిండ పైకపుం
దుడుములురాఁ గలానిధియు దొంటిగతిన్వెనుడాయ డాసె న
య్యుడునఖరాశిఖామణి రఘూద్వహమోహన గేహదేహళిన్.

గీ. అప్పు డప్పల్లవాగ్రిణి యప్పడంతి, యెప్పడరు దెంచి తనదు మోమెత్తి కనదు
చెప్ప దుడిగంబు ముదిగొదచీదరేఁగి, చెప్పియీరాజముఖియోజఁ జెఱచెనార!

ఉ. ఆటఘటించి ఘూర్జటిశరాసనశాసనవాసగమ్యమై
పైఁట సడల్చి గట్టిసగపట్టునునుంజనుకట్టు కట్టఁచో
గాటపుతక్కుజాఁరుడొడికా సెపుదట్టి బిగించుచోననుం
బాటలగంధి చాఁటు తెఱవట్టుటకుం బిలదాయె దైవమా.

ఉ. చేటియుఁ దమ్ముఁ డిచ్చటికిఁ జేరరు నాకిది వేళ నేఁడకో
లాటము దీరి దేవరకు నత్తఱి నీగోడుమెత్తిహత్తితా
లాటపుఁ బాటవాడి నిలయంబునకుం జనుదీనివెంట నీ
పూటకుఁ గాసెమోసికొని పోయినఁ జిత్తము మెత్తనయ్యెడున్.

శా. అంచువ్రాయిడి వన్నెరాఁబులుగు ఊఁడాసీనులూతల్గొనం
బంచాన్యంబులడుల్లుపాఁపదొర గ్రామ్యబ్రహ్మచారుల్దువా
లించం బచ్చనపాత్రఁత లూడిపడు మేల్కల్గుట్ట మన్యంబులో
చంచద్వ్యూహము లుంచు మంటపముపంచంజేరి విశ్రాంతుఁడై.

మ. నలినాక్షుండు సడల్చె నెందు విరిదండ ల్గట్టిగాఁగట్టి దాఁ
దలకుంగొంత తలాడఁగా నడుముహత్తెక్ మెత్తనై చిత్తమ
త్తలిరుంబోడికిఁ దత్తరించి కలవిత్తంబెల్ల హత్తించితిన్
దలిదండ్రు ల్వదండ్రు దాని వలవంతంజింత యింతాయెఁగా.

శా. నేనాద్రవ్యము వెట్టి గట్టిగుడియేనీకట్టినట్లాయెనా
కానీ మీకు మణికిరీటముఖ కైంకర్యంబుఁ గావించుటో
యానారీమణి కిచ్చుటల్ త్వదనుకంపానహాఁ దైతింగదా
యేనాదేవర మాయ దాఁటుటకుఁ దండ్రీ! జానకీవల్లభా.

ఉ. ఏటికి మిమ్ము దూఱనని యింతియుఁ దాఁ దలగంద నాఁటికి
న్నేఁటికి మీగుణం బిసులనేకద యుండునటంచు నెంచఁగా
నోటికిఁ గంటినో వలదు నూటికి నొక్కటియైన నీకత
ల్మాటికి వింటినో రఘుకులప్రవరా యని కన్నుమూయఁగన్.

సీ. కరమబ్బు కరిమబ్బు మెఱుగుబ్బు మయితోడ సరిమిన్న నెఱిబన్నసరముతోడ
నలవాటుగలనీటువలెవాటుపటితోడ సిరిగప్పు నెఱికొప్పు విరులతోడ
ననిశమ్ముఁ గనుదమ్ములను జిమ్ము దయతోడ జగచందుజిగిచిందు మొగముతో
దన డాకడను జోకఁగను కోకకుచతోడ విలుజోడు బలుజోడువెన్నుతోడ

జవనజంఘావిలంఘిత స్తవనభవన, భువననిధిరాజపవనసంభవునితోడ

భద్రతరకీర్తి శ్రీరామభద్రమూర్తి, యతని కలలోన నెదుటఁ బ్రత్యక్షమయ్యె

గీ. ఇట్లు బ్రత్యక్షమగుతండ్రి కెరఁగిలేచి, గాఢరూఢస్వభావంబుఁ గడచిరాము

హస్త మొకయింత మస్తవిన్యస్తమగుటఁ, బ్రతిభవాస్తవ్యుఁ డిట్లని ప్రస్తుతించె.

దండకము:—శ్రీరామభద్రాయ లీలాసముద్రాయ సంభద్రశుంభత్ప్రసాదాంగకాం హాయ భృత్యన్నిలింపాయ తీవ్రాంశువంశార్ణవాధీశరాకాశశాంకాయ ధావళ్యలంకాయగాధేయనీతార్చనాభోగసంబంధగంధస్రజాసీకలనీలాంబుముక్ప్రిభాం గాయతేజోపతంగాయ కుప్యత్ప్రతీయాద్భగక్షిప్రకాశప్రతీకాశపన్నైత్రమానీటుకటుంబప్రతిష్ఠాకృతిశ్రీష్ఠపాదాంబురుట్పాంసులేశాయధాత్రీతలేశాయదుర్వారదోర్గర్వభగ్నీకృతాఖర్వపూర్వోత్తరస్వామికోదండదండాయ జన్యప్రచండాయ సీతావ్యాయపేరియసీతారకాపూర్ణచాకోరకాప్తాయ దాసాత్మసుప్తాయ శర్వద్దశస్యంనాజ్ఞప్తిరుప్తిప్రియాసిద్ధబద్ధప్రతిజ్ఞాయ భాషానునోజ్ఞాయ జాతాపరాధాల్పమేధస్ఫురాధీశ భూరక్షణక్షోణిదృక్కోణదీవ్యత్తితీక్షాయ పంకేరుహాక్షాయ మారీచమాయాచమత్కారధిక్కారనిర్మోచనారాచలాఖేటకాచార చామీకరాహార్యచాపాయ చంచత్కలాపాయ సుగ్రీవసంస్థాపనప్రోల్లలద్వాల్యురఃపీఠశాణోపలోత్తేజితాస్త్రైకహస్తాయ కారుణ్యశస్తాయ సౌవాంధసాద్వజ్జ్వలచ్ఛింధుసంధానకృత్కంధిరాడ్బంధ సంబంధ సేతుప్రసిద్ధ ప్రబంధప్రణీతప్రబంధాయ సత్కీర్తిగంధాయ శక్రాద్యనిద్రాణ విద్రావణామోద విద్రావణశ్రావణగ్వభ్రనిర్భిద్భుజావల్లి వేల్లద్ధనుర్జానిరాతంకటంకార ఘోరాయ శంకావిదూరాయ లంకాధినాథాయతాక్షీణదాక్షాయ ణీవల్లభ శ్రేణి భృత్పాటనాక్షయ్యరక్షఃకనిష్ఠాగరిష్ఠాయ నిష్ఠాయ నైకేతనాస్తోక రైకేతనానేకసాకేతరానేకలోకైకసంశ్రీకసాకేతసీతాసతీసక్తపట్టాభిషిక్తాయ గోత్రాపరిత్రాణ వాల్లభ్యలభ్యాయ భాస్వత్కులేభ్యాయ సంరక్షితాక్షీకయ సంకీర్తనాభ్యాసరోభ్యస్యసభ్యాయ నేమేశనాభ్యాయ తుభ్యంనమః

క. అనివేడ్క విట్కులాగ్రణి, వినుతింప న్విని వినీలవిమలాంగఘనా

ఘనసంపన్నస్వర్ణ, స్వనవాంశుకుఁ డంశుమాలి వంశజుఁ డనియెన్.

శా. వత్సా తొల్లి ఛిక్కంటె దివ్యమణిసవ్యద్రవ్య ధాన్యాదులుం

ద్వత్సద్మంబునఁ బద్మపాదుకొనుఁ జింతల్మాను మత్సాధకం

గత్సేవైకకిరీట పీఠముఖ కైంకర్యంబుఁ గావించి నీ

వుత్సాహంబున నుత్సవంబుఁ గనుమా యుత్సంగజాతాగ్రజా.

క. అని యానతిచ్చి మచ్చిక, జనకతనూజాధినేత చనఁ గ్రక్కున మే
ల్కని చెక్కులఁ జాల్గొని తన, కనుఁగవ మోదాశ్రుతుషారకణములు గురియన్.

శా. సంధాతన్నవధాతటిచ్చపలవేశ్యావశ్య దుస్సంగ సం
బంధంబుల్ దెగటార్చి కూర్చితి బలిప్రహ్లాదుల న్నేఁడు నా
బంధుల్గా నిటు నెందు నేర్చితొ విపద్బంధుత్వ మోతండ్రి కి
ష్కింధారాజ్య రమాధురంధరిత సుగ్రీవా రఘుగ్రామణీ.

మ. అనుచుం గోవెలకేగి దేవమణికి కిన్సాష్టాంగదండ ప్ర
ణామనుతుల్సేసి గృహంబుఁ జేరి సిరులన్మాతాపితృ స్వాంతము
ల్దనియించెం జనులెంచ నద్భుతమహోత్సాహంబు సంధిల్లన
ద్దినమారెల్లను నొడ్డగిల్లఁ బడి కీర్తించెం గిరాటాత్మజున్.

మ. శతమన్యుప్రముఖు ల్విరించిసభకుం జం దెంతు రాబ్రహ్మయ
చ్యుతు సేవింపఁగవచ్చు నట్టినలినాక్షుం డింటికి న్వచ్చి నన్
శ్రితదేవుం దయఁ దేర్చె నేను నిను జేర్కొంటిన్ భవన్మందిరా
గతిఁ గంటి న్నతివంటివాఁ డ వనుటల్గా చెం గిరాటుం డిలన్.

శా. కట్టించె న్భరతాగ్రజన్మునకుఁ బ్రాకారావళు ల్గోపురం
బొట్టించె న్రఘునేతకుం బడితరం బొప్పంగ ధాన్యాదులం
బెట్టించెన్ ద్విజకోటికి న్రఘుపతి ప్రీత్యర్థమై సత్రముల్
ధట్టించె న్బలిశాదరాయణులఁ దద్భక్తుండు తత్త్వంబునన్.

గీ. పౌర శ్రీరామ కైంకర్యహార్యవార్య, చర్యయెట్టిదో గాని యయ్యార్యతనయ
పుంగవుండాయురారోగ్య భోగ్యభాగ్య, పుత్రపౌత్రాభివృద్ధిచేఁ బొలుపుఁగనియె.

క. మొదలఁ గలానిధిచరితముఁ, జదివిన వ్రాసినను వినినఁ జతురుం డతిసం
పదఁ జెందు నున్మదమొందు, న్మదియందుం దురితమునకు మఱి చోరఁ డెందున్.

వ. అని శుకయోగీంద్రుం డానతిచ్చిన బహుళాశ్వచరిత్రంబుఁ బరీక్షించి పరీక్షిన్నరేం
ద్రుండు పరమానందకందళిత హృదయారవిందుం డయ్యె.

శా. రాజీవాయతలోచనా జననవప్రద్యుమ్న ప్రద్యుమ్నవి
భ్రాజన్మందిర బాంధవాలినలినీపద్మాప్త పద్మాప్తవి
ష్టౌజాగ్రత్కరుణాప్త సప్తవిధసత్సంతానసంతానధా
త్రీజాలామితవిస్ఫురద్రతరణశ్రీవాస శ్రీవాసవా.

క. దామరలవంశసోమా, సోమధనుర్విజితధైర్య సుస్థిరధామా
ధామవిజృంభణభీమా, భీమాగ్రజరాజమాన్య పృథుగుణధామా.

ఉ॥ త్సాహ. వాసవాంబరాంఘ్రిభక్తవశమనోజ్ఞభాసురా
భాసురారి వరతురంగభారికీర్తివాసవా
వాసనాదిశోభితగుణవారసుమహిమాసమా
మాసమాజనిభవదీప్తమాననీయవాసవా.

గద్య. ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్రకరుణానుగ్రహాశాశ్వతైశ్వర్య ధుర్యతామహేశ్వర రూపరేఖావిజితరతీశ్వర సరససంగీతసాహిత్యసకలకలావిచక్షణ సమాశ్రితవిద్వత్పరిరక్షాదక్షణక్షణ యనిగెలగోత్రపావన పరిపంథిరాజకల్పితపాదసేవన దామరల వేంకటాధీశపుత్ర చెన్నభూపాలకకలితసౌభాగ్యగురువమాంబాగర్భశుక్తిముక్తాఫలగుణగణజనసంభవాభవశేషభాషామనీషాబల ప్రతిదినాగతార్థి జనవరప్రదాయక శ్రీవేంగళనాయకప్రణీతంబైన బహులాశ్వచరిత్రంబను మహాప్రబంధంబున సర్వంబును పంచమాశ్వాసము.

సమాప్తము.